శ్రీరస్తు.



# శ్రీతులస్యుపాఖ్యానము.

ఇది.

చిలకపాటి - వేంకటరామానుజశర్మచే విరచితమై

శ్రీరాజా - చెలికాని

## వేంకటగోపాలరావుగారి

ధనసహాయముచే

మద్రాస్,

శ్రీనికేతనముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1902

వెల 0-6-0

Presented

to

the Thikkana Library of

the Young Men's Literary Association

by

Mr. K. Kotilingam

High Court Vakil

Guntur

శ్రీరస్తు.

# శ్రీతులస్యుపాఖ్యానము.

[బ్రహ్మవైవర్తపురాణము ప్రకృతిఖండంబున నాలుగవయధ్యాయమునందలి పదునాలవ శ్లోకము మొదలుకొని యాయధ్యాయము తుదముట్ట నీతులస్యుపాఖ్యానముతో సంబంధించినకథ యగుటం జేసి యది పద్యరూపము గా రచియించి దీనితోఁ జేర్చియున్నాను.]

## —* శ్రీవైకుంఠ నగర వర్ణనము. *—

శా॥ శ్రీకంఠాంబుజసంభవాదివినుతశ్రీభాసురం బై లస
ద్రాకానాథసహోదరీనిలయమై రాకేందుకోటిప్రభా
స్తోకం బై సనకాదియోగిహృదయస్తోమంబులం బొల్చునా
వైకుంఠం బలరారుచుండు భువనవ్రాతోర్ధ్వదేశంబునన్.

చ॥ అందు వసించుపూరుషు లహస్కరకోటివిదీప్తతేజసుల్
మందరధారిరూపు లతిమాన్యచరిత్రులు భక్తియుక్తి శ్రీ
చందనగంధిప్రాణవిభు సారసలోచను నెల్లకాల మిం
పొంద నహైతుకంబుగ మహోన్నతిఁ గొల్చుచునుందు రాశతోన్.

ఉ॥ ఆగమగోచరుం డయినయాభగవంతుఁడు ధర్మరూపుఁ డి
చ్ఛాగతి నాత్మభక్తజనసంతతిఁ గావ విశుద్ధసత్వతా
శ్రీగత మైనమూర్తిని ప్రసిద్ధము గాఁగ ధరించి పొల్చు నా
నాగవరాహివైరి పృతనాపతి ముఖ్యులు గొల్వ నయ్యెడన్.

సీ॥ శ్రీహరిపాదాబ్జసేవచేఁ గాంచినమరకతహేమవిమానగణము
నారోహణముచేసి యతిభక్తి శ్రీహరిఁ బాడుచుఁ దద్గుణప్రకరజలధి
మగ్నమానసు లయి మహిళాజనంబులలలితశృంగారవిలాసములకు
బలితంపునునుగబ్బిబటువుగుబ్బలచక్కఁదనమునకును బృహత్కటీతటముల
విప్పుదనమునకును దామె కప్పుడైన । మదిఁ గలంగి రజోగుణమలినభావ
మొందక యయుండ్రుముక్తులబృందమచటఁ ॥ గ్రందుగఁ జరించు నాపురరాజమునను.

చం॥ అనుపమయోగశక్తిఁ బరమాంబరవీధి మురాసురారిచే
తను ధృతమై జరామరణదారుణరోగభయాదివర్జితం
బు ను నయి మండలాకృతినిఁ బొల్చుచు యోజనకోటివిస్తృతం
బ న మహనీయరత్నకనకాంచితభూముల నొప్పు నెప్పుడున్.

చం॥ అనుపమరత్నసంఘటితహాటకనిర్మితకుడ్యసంతతుల్
ఘనతరగారుడాశ్మపరికల్పితభూస్థలు లుజ్వలంబు లై
తనరెడిపద్మరాగమణిదర్పణముల్ పటికంపుఁదల్పులున్
ఘానరువడం గ నొప్పుగృహపుంజము వొల్చుచునుండు నప్పురిన్.

సీ॥ కామదుఘంబు లై కలితసర్వర్తుసంపద్విరాజితము లౌపాదపములు
వనితలఁ గూడి శ్రీవల్లభుఁ బాడుచు మానుగఁ దిరుగువైమానికులును
సారసదాత్యూహచక్రవాకమరాళవర్ణితశ్రీసరోవరకులములు
వికసితమాధవీవిసరనిర్యన్మధుగంధబంధురమందగంధవహము
రమ్యమణిమయలీలాధరాధరంబు । లమరుచుండెడి నిశ్శ్రేయసాఖ్యవనము
మూర్తిఁ గైకొన్నకైవల్యమునకు సాటి । యగుచు నప్పురి నొప్పు నహార్యమహిమ.

మ॥ సరసీసంతతి భృంగవల్లభులు కంసధ్వంసిచారిత్రముల్
సరి దాఁ బాడెడురీతి గానము రసాసారంబు గా సల్ప బం
ధురచక్రాంగముఖద్విజావళులు సాధువ్రాతముం బోలె భా
సురకోలాహలముల్ రచించుగతిఁ దోఁచున్ రావముల్ సల్పుచోన్

చం॥ తులసిని భూష గాఁ గొనుచుఁ దోయజనేత్రుఁడు సేయుమన్ననల్
పలుమఱు గాంచి పుష్పకుజపఙ్క్తులు దానితపఃఫలంబు ని
ర్మలశుకకోకిలోక్తులఁ దిరంబు గ సంస్తుతిసల్పి వాయుసం
చలితశిరంబులం బొలుచు శ్లాఘయొనర్చుగతిన్ వనాళిలోన్.

ఉ॥ ఆనగరంబునం బొలుతు రార్యలు సూత్రవతీముఖాంగనల్
పూనినభక్తి నిందిరకుఁ బూజలు సల్పుచుఁ జెల్మికత్తె లై
శ్రీనళినాక్షుపాదసరసీరుహచింతన మెల్లకాలమున్
మానసమందు సల్పుచు రమారమణీసదృశాత్మరూప లై.

చం॥ రజనికరాననల్ భ్రమరరాజివిరాజిత నీలకుంతలల్
గజపతిగామినుల్ కుసుమగంధులు త్రస్తమృగీవిలోచనల్
సుజనసుతల్ జపాధరలు సుందరమందరపీవరస్తనుల్
నిజతనుదీప్తిఁ బొల్చెదరు నీటు గ నచ్చటియచ్చరాంగనల్.

ఉ॥ అమరవైరిశిక్షాహృదయహారిణు లై యసమానసద్గుణ
స్తోమము నిండుజవ్వనము సొంపగురూపము గల్గి యిందిరా
కామిని, వాణి, గంగ యను గామితసిద్ధులఁ జెందుచుండు రా
శ్రీమహితాత్మపట్టమహిషీమణు లై నతకోటిఁ బ్రోచుచున్.

ఉ॥ మువ్వురుభార్యలం గలసి మోదము పెంపుగనంగ రక్తుఁ డై
యవ్వలమానమీనమిథునాకృతిలోచనలందుఁ దుల్యతన్
బువ్విలుకానిసౌఖ్యభవభూరివిశేషము లోలిఁ గాంచుచున్
మవ్వపులీల మాయఁ గొని నాగశయానుఁడు దాఁ జెలంగెడిన్.

చం॥ భవబంధంబులఁ బాసి ముక్తు లగుచు న్భాసిల్లుపుణ్యాత్ములన్
భువనవ్రాతములన్ సుధాంధులను గోభూవిప్రయోగీంద్రులన్
సవనగ్రామములన్ మహామహిమతో సంరక్షణం బారఁ జే
యువిధం బే పని గాఁగ శ్రీవిభుఁడు దా నొప్పారు నప్పట్టునన్.

## —* విష్ణుమూర్తి తన కాంతలతోఁ గ్రీడింపఁ దలంచుట. *—

ఉ॥ అమరవైరి యొక్కసమయంబునఁ బేరిమి నిండుకొల్వునన్
గోమలియుక్తుఁ డై భువనగుప్తిభరంబు వహించి రాజ్యమున్
శ్రీమహితంబు గా సలిపి శ్రీముఖకాంతలతోడ వేడ్కతోఁ
గామముఁ గృతార్థుఁ జేయ మదిఁ గాంచెను కోరిక లింపు మీఱఁ గన్.

వ॥ ఇట్లు దలంచి యామధుమథనుండు,

సీ॥ ఆత్మీయభువనరక్షాధికారభరంబు నల సూత్రవతిభర్త కప్పగించి
ఘనులు సల్పెడుసామగానకోలాహల మించుక నిల్వన కైచ్చరించి
చామరవ్యజనాదిసమితిఁ గైకొని వీచుమించుబోఁడుల విరమించఁ బంచి
గరుడాదిపరిచారకప్రముఖులఁ బురమలవుతో రక్షింప నాజ్ఞ యొసఁగి
కొలువు సాలించి నగరులోపలికిఁ బోవఁ। దామరాలయ యిచ్చకై దండఁ గొనుచు
శేషసింహాసనము డిగ భాష గంగ। చాయ నంసోత్తరీయంబుఁ జక్కనొత్త.

సీ॥ అంత శ్రీవిభుని కేకాంతకైంకర్యంబు సలుపుచు శేషాఖ్య వెలయునట్టి
యహిరాజు దా రత్నమహితపాదుక లయి ముందుఁ గన్పడ పాదములకుఁ దొడిగి
పాండురం బగునాతపత్ర మయి చామరవ్యజనాదు లయి దాస్యవైభవంబు
సక్తి సలుపునసంతుభక్తికి మెచ్చుచు లోనగరుకుఁ జని శ్రీనివాసు
డనుపమానంతమణిమయాసనమునందుఁ। గూరుచుండి మనోభవక్రూరబాణ
జాలనిర్భిన్నమానససారుఁ డగుచు। బాళి మీఱంగ నీక్షించె భామినులను.

ఉ॥ సుందరమందహాసరుచిశోభితలీలల సొంపు మీఱి ని
ష్పందము లై యనూనసుమసాయకమోహపయోధివీచికా
మందతరప్రవాహ మతిమాత్రము గాఁ గ ను వెల్లిగొల్పుచున్
మందరధారిచూపు లణుమధ్యలపైఁ బ్రసరించునంతలోన్.

సీ॥ శారదచంద్రికోదారకాంతుల మీఱుచిఱునగ వాసనసీమఁ దోఁప
నీలనీరజదళలీలాకటాక్షవిక్షేపంబులను నునుసిగ్గు గదుర
కుంభికుంభోపమకుచకుంభములు వేగ యుబ్బి యొండొంటితో నొరసికొనఁగ
హాటకకృతశలాకాకారతనువల్లి మెండు గాఁ బులకలు నిండుకొనఁ గ
పోఁకముడి జాఱ కోర్కులుఁ బొడముచుండఁ । గుసుమబాణశరాసారఘూర్ణమాన
మానసాంభోజ లై గంగ మగనిమోముఁ । జూచె సవతులు తనచాయఁ జూచుచుండ.

ఉ॥ అంగజమోహనాస్త్రములయందునఁ బైపయిఁ బర్వి సిగ్గునన్
రంగు గ వేగమే మరలి రక్తి గతాగతకారు లైనయా
యంగనజూచుచూపుల కహార్యధరుండు ను లోఁ గరంగి తాఁ
బొంగుచు నవ్వ నవ్వేలఁదిపొత్తు మదిం దలపోసి వేడుకన్.

వ॥ అప్పుడు.

## —* లక్ష్మీసరస్వతులు గంగాదేవిపైఁ గోపపడుట. *—

శా॥ ఆవాణీకమలాలయల్ సవతితో నాత్మేశుఁ డింపారఁ గా
భావంబం దనురాగసంపదలచే భాసిల్లుటల్ గాంచి రో
షావాప్తిం దమమానసంబు లుడుకన్ యక్షేశునిన్ రూక్షవీ
క్షావామంబుగఁ జూచి గంగపయి మాత్సర్యంబు పెంపారఁ గన్.

వ॥ వెంట న య్యావాల్గంటిమొగంబుం గాంచిరి. అంతట.

సీ॥ నీలనీరజదళశ్రీల నొప్పెడుకన్నుఁగవ శోణకాంతులు గ్రమ్ముకొనియె
మధుమాధవీలతామానితాంగంబులఁ గంపంబు పైకొని గడిత మయ్యె
మత్తశుకాలాపమధురంబు లై యొప్పుపలుకులఁ బలుతొట్రుపాటు వొడమె
పక్వబింబోపమప్రభ లొల్కునునుమోవు లంతకంతకు వేగ యదర సాగ్రడియె
వేడియూర్పులు పైపయి వెడలఁదొడఁగె । వడి మొగంబునఁ గనుబొమల్ ముడులు వ
సపతిపైయుద్భవించురోషంబుచేత । భారతీకమలాలయాభామినులకు.

మఱియును.

సీ॥ తనువల్లి నలఁదినచట్టంపుఁజందన మెండి మెండుగఁ బెట్టి పిండి యయ్యె
కులుకుగుబ్బలమీఁదితళుకుముత్తైపుసరుల్ క్రన్ననఁ జిటిలుచు సున్న మయ్యె
నఱుతఁ దాల్చినపుష్పహారసంతానంబు సొం పేది కందుచుఁ జూర్ణ మయ్యె
నవ్యకాంచనభూషణములసంతానముల్ తప్త మై కఱఁగుచు ద్రవము లయ్యె
నిందిరాదేవికిని భారతీందుముఖికి । నభినవోద్భూతచండకోపాగ్నిభీక
రోరుకీలాకలాపంబు లుగ్ర మగుచు । నంతకంతకుఁ బై గ్రమ్మునవసరమున.

వ॥ ఇట్లాయండజగామినులు ప్రచండతరం బగుచవతిమచ్చరం బు పెచ్చుపెరిగి యీర్ష్యయు కోపంబు విచారంబు ను ముప్పిరిగొన లోఁగలంగుచుండిరి. అం దరవిందమందిర యగుసుందరి తాను సత్వరూపిణి యగుటంజేసి విజ్ఞానంబునలనఁ గ్రోధం బుడిగి కలంకదేరి శాంతిం గైకొని భారతితో ని ట్లనియె,

గీ॥ భారతీదేవి కోపంబు పాప మగుటఁ। జేసి సాధువు లద్దానిఁ జేరనీరు
కాన నుడుగుము కోపంబుఁగమలనయన। సౌహృదం బాత్మఁ గైకొని సఖియవినుము.

సీ॥ కొందఱు విడనాడి కొందఱుప్రియురాండ్రతో సుఖింపఁగ స్వతంత్రుండు భర్త
తనమది కెక్కనితరుణులతోఁ బొందు కాదని విడిపింపఁగర్త కాంతుఁ
డందఱు దయితల నాసఁ గైకొని సుఖవార్ధిఁ దేలింపంగ వలఁతి మగఁడు
రాగంబు లేనిచో రమణుల నెడబాసి యుండుటకు ను వల్లభుండు ప్రియుఁడు
కాన పురుషునిడవళ్లు కామినులకు । నిష్టములు కాక యుండిన నీసు గొనక
యాదరంబునఁ బతిమానసానువృత్తి । సాధ్వి కెప్పుడు సల్పంగఁ జనును చెలియా.

ఉ॥ భారతి వల్లభుండు పరభాములతో సుఖియింప సాధ్వి యా
సారసనేత్ర హారిపయి సల్పదు కోపము వారికిం బ్రియం
బారసి చేయుచుండుఁ బతి కాత్మముదం బలరారునట్లు గా
సారవిచార యాతరుణి సల్పదు విప్రియ మాత్మభర్తకున్.

ఉ॥ కామినికి న్సురూపము ను కాంతి యు సత్కులభాగ్యసంపదల్
శ్రీమహితత్వమున్ ఘనత చెల్వములు న్మఱి యేమి యుండినన్
స్వామినిఁ బ్రీతుఁ జేసికొన సద్గుణసంపద చాలునట్లు గా
భామిని చాల దొక్కటి యుఁ బామరు లిట్టి వెఱుంగ రాత్మలన్.

చం॥ మనము ను మానసంబులను మానము మాని ప్రియంబుతోడ నీ
జననుతు భక్తవశ్యు హరిఁ జక్కనిబత్తినిఁ గొల్త మేని యీ
ఘనుఁ డనురాగ మొంది మనకామితముల్ కృపచేసి వేడుకల్
దనరఁ గ గారవించు దయితాజనముఖ్యత యిచ్చి హెచ్చుగన్.

వ॥ అని యివ్విధంబున నయ్యిందిరాసుందరి మందహాససుందర వదనారవింద యగుచు మందమందవచనంబుల సాంత్వనం బొనర్ప నయ్యరవిందమందిరపలుకులు పెడచెవిం బెట్టి సరస్వతి యు నంతకంతకు మనస్తాపంబు దుర్నివార్యం బై పెచ్చుపెరుగఁ గ్రోధావేశపరవశ యగుచు రక్తపంకజప్రభాపటలపాటలంబు లగుకాంతులు మోముదామరయం దినుమడింప నతిరూక్షంబు లగుకటాక్షంబుల నాథుని మొగం బవలోకించి యి ట్లనియె.

ఉ॥ కామిను లెంద ఱున్న నధికంబు ను తక్కువ గాని ప్రేమ యా
భామినులందు యోగ్యుఁ డగుభర్తకుఁ దుల్యతఁ బెంపుమీఱు నా
స్వామి ఖిలుండు తా నయిన సర్వసమత్వము సచ్చరిత్రముల్
భూమిని వైపరీత్యమును బొంది యొసంగును ప్రాణనాయకా.

ఉ॥ ఓమురవైరి గంగకు మహోజ్జ్వల మాసుభగత్వసంపదల్
శ్రీమహితత్వ ముండుటను చేకొన నాపెను గోరి తీవ్ర శ్రీ
సామటయాన యాయమకు సాటి గ నొప్పుచు నుండు గాన నా
కామినియందు రాగమును గాంచెద వే నటువంటిదాన నే.

కం॥ కమలాలయకు ను గంగకు । సమ మై యొండొరుల కెపుడు సఖ్యం బుండున్
కమలాక్ష కాన నిందిర । వినునస్కృతఁ జెంద దిట్టివిషమమునందున్.

చం॥ మగనికిఁ బ్రేమ లేమి నభిమానము దక్కి సపత్ను లందఱున్
తగ వఱ గారవం బుడిగి దగ్గఱఁ జేర్చక చుల్కసేయ న
య్యగడుల కోర్చి యోర్చి హృదయంబునఁ గుందుచు వాసరంబు లి
మ్ము గ గడపం గ నయ్యె నొకమూల వసించుచు నాకు నక్కటా.

గీ॥ ఏఁ బతిప్రేమవంచిత నేల నామ । జీవనము నిష్ఫలం బేమి సేయుదాన
వల్లభుని ప్రేమ లేనియావనిత బ్రదుకు । నడవిలోఁ గాయువెన్నెలయట్లు గాదె.

గీ॥ నిన్ను సత్త్వరూపు నిఖిలేశుఁ గా నాడు । కొనెడివారి మూర్ఖు లనఁగ వలయు
వేదవిదులు వారు విపరీతబుద్ధులు । నీదుబుద్ధి యెటులఁగ నేర రకటా.

చ॥ అన విని వాణిపల్కులు మహాగ్రహరూక్షతఁ గొన్న యాసతిన్
గనుఁగొని శ్రీధరుం డిపుడు కా దిఁట నుండఁగ నంచు నెంచి యా
సనకసనందనస్తుతుఁడు చయ్యన నాసభ వాసి పోయెఁ దా
మనసున భావికార్యములు మంతన మాడుచు నేర్పు మీఱఁ గన్.

## ——* సరస్వతి గంగను దూషించుట. *——

కం॥ కమలాక్షుం డటు లేగఁగ । విమనస్కత మీఱి వాణి విగతభయ యునై
క్రమ మేది గంగతో సం । భ్రమమున ని ట్లనియె శ్రవణపరుషము గాఁ గన్.

శా॥ ఓసీ సిగ్గొకయింత లేదు గదవే యూహింప నీ వీసభన్
బాసల్ చేసెద వాత్మనాయకునితోఁ బాపంబు కామంబు కా
దే సంసారిణి కీవిధంబు దగు నే ఘే మంము నీగర్వముల్
నీసౌభాగ్యము మాకుఁ జూపవలె నే నీచంబు లే యీపనుల్

చం॥ కుమతిరొ యాత్మనాథుఁ డనుకూలత రాగముఁ జెందియున్నఁ గా
మము తల కెక్కి గర్వగరిమంబునఁ గన్నులు గాన కిట్టులీ
క్రమమున విఱ్ఱవీఁగెదవు కాంచెద నీయభిమాన మిప్డు వే
గమ భవదీయమానమును గన్గొను చూర్ణము సేయుదుం దగన్

గీ॥ మగఁడు వశ్యుఁడనుచు మగువ గర్వించెదు । మగనియెదుట నీకు మానభంగ
మే రచింతు నాతఁడేమి సేయఁ గలండొ । నాకు నతఁడు ప్రాణనాయకుండు.

కం॥ అని భారతి పల్కుచుఁ జ । య్యనఁ బీఠము డిగ్గి లేచి యమితక్రోధం
బున గంగకురులు తనచే । తను గట్టిగఁ బట్టితిగువఁ దత్తఱపడఁ గన్.

గీ॥ వారినడుమ నుండి వారిజాలయ యప్డు । వాణి నడ్డగించి వలను మీఱ
చేతఁ బట్టి నిలిపెఁ జేరంగ రానీక । యంత పద్మపైన నాగ్రహించి.

వ॥ ఆవాణి యిట్లు శపించె.

## ——* లక్ష్మి గంగా సరస్వతులకు శాపంబుగల్గుట. *——

మ॥ కమలా యీవిపరీతముం గనుచు స్తోకం బైనఁ జింతింప కీ
క్రమ మొప్ప న్నదిరీతి వారణము ధైర్యం బారఁ గా సల్పి వృ
క్షముమాడ్కిన్ దగ నూరకుండెదవు రోషం బేమి యున్నేను ని
క్కము గా వృక్షసరిత్స్వరూపములు సంక్రాంతంబు లౌ నీ కొగిన్.

మ॥ అని వాగ్దేవి శపించిన న్విని యు నయ్యబ్జాలయాదేవి వా
ణిని( దా( దిట్టక కోపగింపక మది న్నిర్విణ్ణ యై భారతిం
దనహ స్తంబున( బట్టికొంచు నిలిచెం దన్వంగి దుఃఖాబ్ధిమ
జ్జనరూఢం బగునంతరంగమున భ్రాజద్భీతి యేపార( గాన్.

ఉ॥ అప్పుడు కోపవేగమున నంగము కంపము నొంద( బైపయిం
దెప్పుచు గంగపై కుటుకుదేవి సరస్వతి( గాంచి గంగ తా
దెప్పర మైనకోపమున( దేకువతో సిరి( జూచి చెప్పె నో
కప్పురగంధి దీని విడు కాంచెదు దీనిసమర్థతల్ వెసన్.

ఉ॥ ఓచెలి యేమిసేయ(గల దో యిది చూతము దీని పీడుమా
యాచలబుద్ధికిం గలయహీనబలం బది యెట్టి దో మదీ
యాచలధైర్యసంపద యహార్య మటంచు నెఱుంగ( జాల దీ
నీచ యు కయ్యమున్ సలుప నిచ్చలు గోరుచు నుండు మెండుగన్.

గీ॥ అతివరో యిది వాగ్దుష్ట యనవరతము । కలహకారిణి దుర్ముఖి మలినచరిత
స్వబలపరబలవిజ్ఞానచతుర గాదు । లలి నెఱుంగుము మాబలాబలము లిపుడు.

వ॥ అని క్రోధోద్దీపిత యై మఱి యు ని ట్లనియె.

క౦॥ నిను శపియించినయీశా । పన యే లై పోవు( గాత పాపపుమ ర్త్యం
బున కచటిపాపిపాపము । లను బొందుచు నుండు శ్రీబలంబులు దొల(గన్.

క౦॥ ఆమ ర్త్యంబున పాపి । గ్రామము వసియించుచోట( గాసిలి కలి ను
ద్దామం బగుతత్పాపము । లామహి నీమందభాగ్య యనిశము గాంచున్.

క౦॥ అని గంగాసతి శపియిం । చిన భారతి గంగ( గాంచి శీఘ్రము గా ని
ట్లనె నీవె మర్త్య భూమికి( । జను మచ్చటిపాపిపాపసంగతి( గన(గన్,

సీ॥ అని శపియింప( గా నయ్యవసరమున హరి యు( జతుర్భుజు లైనపార్ష
దులు నల్వురు ను దనతోడ రా నాసభ కేతెంచి జరిగెడు సేత( గాంచి
భారతి( గరమున( బట్టి వక్షంబున( జేర్చి సర్వజ్ఞు( డాచెలువ కపుడు
దారుణం బైనక్రోధంబు శాంతము చేసి వాణిని( జూచి శ్రీవత్సధరు(డు
చెప్ప( దొడ(గె వినుము చేడియ యీలోన( । గలహ మొదవ టకు ను గారణంబు
భావి యైనకార్యభరము సేయ( గ( గల । మామకీనకార్యమర్మ మతివా.

వ॥ మఱి యు మీకొండొరులకు శాపంబుగల్గుట యు భవిష్యత్క
థా కారణకం బని పల్కిన నవ్వనజనేత్రునిపల్కులరహస్యంబు( దెలిసి

కొని యామానినులు మిగుల దుఃఖించుచుం జేయునది లేకయుండ జగ
త్పతి యు నందు నిందిరాసుందరిం గాంచి సమయోచితంబుగ నిట్లనియె,

సీ॥ పాలతిరో నీవు నీకలచేత భూమికిఁ బొమ్ము ధర్మధ్వజభూమిపతికి
భామ యయోనిసంభ వైనకూఁతుర వయి యప్డు దైవదోషాభిభూత
వగుచు వృక్షత్వంబుఁ దగఁ గైకొనుము నాయంశసంభవుఁ డైనయసురపతికిఁ
గామిని వయి యంతఁ గడఁగి పాపత్ని వై వెలయంగఁ గల విది వెలఁది నిజము
భారతంబునఁ త్రైలోక్యపావని యగు।తులసి యను పేరఁ బరఁగి యాస్థలమునందుఁ
దేజరిల్లుము పద్మావతీసమాఖ్య।గలమహానది వయి నీవు కమలనయనా.

వ॥ అని యాన తిచ్చి గంగాదేవిం గాంచి యి ట్లనియె.

సీ॥ కమలదళాక్షి యోగంగావధూమణి నీ వంశమున విశ్వపావని వయి
పాపులపాపముల్ పాపంగ భారత వర్షోత్తమమునకు వలను మీఱ
రా జైనయాభగీరథుఁ డొనరించినదుష్కరతపముచేఁ దొడరి పోయి
భాగీరథి యనంగఁ బరఁగుచుఁ బూత వై భూమి మదంశసంభూతుఁ డైన
యాసముద్రునికిని పత్ని వై చెలంగి।మత్కలాజాతుఁ డై భూమి మహిమఁ జెంది
శంతనుసమాఖ్య నొప్పురాజప్రధానుఁ।జెట్టఁబట్టుము నాయాజ్ఞచేత నాతీ.

వ॥ అని చెప్పి భారతీదేవితో ని ట్లనియె.

ఉ॥ భారతి నీకలాంశమున భారతభూమికి నేగుమీ సప
త్నీరజనీకరాననల నిర్భరరోషముతోడఁ దిట్టుచున్
శారత వారితోఁ గలహసూచనముల్ రచియించినందుకున్
ఘోరఫలంబు నీ కగును కోమలి చెందుము దాని నంత యున్.

కం॥ స్వయ మీవు జనుము ధాత్రాలయమునకు ను నలువ కీవు లలనామణి వై
నయమున వెలయుము శంభ్వాశ్రయమునకును గంగ స్వయము జనఁ గా వలయున్.

గీ॥ ఇచటఁ బద్మ యుండు నెలమితో నా దేవి।శాంతుశాలు క్రోధసహిత గాదు
సాధ్వి సుభగ ధర్మచారిణి మద్భక్త।శీలవతి యనం గఁ జెల్లుచుండు.

గీ॥ తత్కలాంశ లైనతరుణులు శాంతలు।ధర్మనిరతమతులు ధన్యశీల
లాత్మభర్తృభక్త లయి సద్యశోవృద్ధి।వెలయుచుండువారు విశ్వములను.

కం॥ కూడదు భార్యాత్రితయము । కూడదుశాలాత్రయంబు గుణవంతునికిన్
గూడదు బంధుత్రయ మది। కూడదు భృత్యత్రయంబు కుశలముఁ దోలఁచున్.

ఉ॥ ఆరయ నేగృహస్థునిగృహంబున కంగన తాను దిట్టయై
పూరుషరీతి గాఁ బ్రభుతఁ బూని చరించు నో సారసాక్షికిన్
గూరిమి వశ్యుఁడై యెవఁడు గ్రుమ్మరుచుండు నో వాని కెప్పుడుం
జేరుచు నుండు నాపదలు జీవితసత్త్వ యు నిష్ఫలం బగున్.

గీ॥ యోనిదుష్ట యైనయువతి యు ముఖదుష్ట। యైనచాన కలహ మాడునాతి
ఎవని కుండు నతఁడు హీనుఁ డౌఁ గానఁ గా। ననమునకును జనుట నయ మతనికి

కం॥ సులభములు జలము లవ్వని। సులభంబులు పండ్లు లచట సులభములు మహీ
తలవాసనుఖము లయ్యవి। గల వే క్రూరం పుఁబడతి గలలోఁగిటిలోన్.

కం॥ వర మగ్నియందు నిలుచుట। వర మగు ఘాతుకమృగాదివర్గంబులతో
నిరతం బుండుట క్రూరపుఁ। దరుణులయెడ ననికి దుఃఖదాయక మరయన్.

కం॥ క్రూరపురోగజ్వాలలు।దారుణవిషవహ్నిశిఖలు। త్రాస మొనర్ప
న్నేరవు క్రూరస్త్రీముఖ।ఘోరజ్వాలాశిఖంగిఁ గుతలమునందున్.

ఉ॥ స్త్రీజితుఁడైనపూరుషునిజీవితకాలము నిష్ఫలం బగున్
స్త్రీజితుఁడైనయానరుఁడు చేసెడికర్మము నొందు వ్యర్థతన్
స్త్రీజితుఁడిందు నింద్యుఁడయి చెందును దుర్గతిఁ గీర్తిహీనుఁడై
స్త్రీజితుఁడైనమానవుఁడు జీవితుఁడైన మృతుం డనం దగున్.

చం॥ చవతుల కగ్నిరాజికిఁ బొసంగదు గా యొకచోట నున్కి సం
భవ మగునేని కీడగును భార్యలు పల్వురు గల్గువానికిన్
శివశివ కష్ట మే యగును చేడియ యొక్కతె యుండువానికిన్
భువి సుఖసారసంపదలు బోణిమిఁ గల్గుచునుండు మెండుగన్.

వ॥ అని చెప్పి మఱియు గంగా దేవితో నిట్లనియె.

చం॥ వనజభవాలయంబునకు వాణి యుఁ బోవ నగున్ శివాలయం
బునకును నీవు పొమ్ము సిరి బోణిమి నిచ్చట నుండుఁ గాత స
జ్జనసుతశీల యామగువ, సాధ్వి సుశీల యు నైనపత్ని యె
వ్వని కొనగూడు స్వర్గసుఖవర్గము వానికి లభ్య మై తగున్.

ఉ॥ ఏనరుపత్ని సాధ్వి యగు నెప్పుడు వాఁడు విశుద్ధుఁడై సుఖం
బానికఁ గాంచి ముక్తుఁడగు నంతమునం, దెవఁ డొందు నార్య యా
చానను; వాఁడు దుఃఖమును సౌఖ్యవిహీనత గల్గి జీవితుం
డైన మృతుం డనం దగు మహాకలుషాత్ముఁ డతండు నారయన్.

వ॥ అని పల్కి జగత్పతి యగునారాయణుం డూరకుండిన నంత నానారీతిలకంబులు తమకుం గలిగినబెట్టిదంపుదశావిశేషంబున కుం గుందుచు నొండొరుల నాలింగనంబు గావించుకొని పెద్దపెట్టున నేడిచి యేడిచి కొంతదడవునకు రోదనంబు సాలించి దీర్ఘాలోచనంబుఁ గావించి శోకబాష్పంబులు కనుదమ్ములం దొరఁగ భయవేగకంపితంబు లగునంగవల్లికలు దూలాడ నొక్కొక్కరుగ నయ్యరవిందలోచనుని కిట్లనిరి. అందు భారతీదేవి భగవంతుని కిట్లనియె.

చం॥ తోయజనేత్ర నేను బహుదుష్టను దండితఁ జేయుమయ్య నీ
వాయతసత్కృపామహిమ, నార్యవరుం డగునాథుఁ డీసునం
బాయక భామల న్విడిచి బాములఁ బెట్టఁ దలంచె నేని యే
చాయ ధరాస్థలిన్ బ్రతుకఁ జాలుదు రాధవశాత్రు లెయ్యెడన్.

ఉ॥ యోగముఁ జేసి దేహముఁ బయోజదళాక్ష పరిత్యజించెదన్
నాగశయాన నిన్విడిచి నన్బ్రదుకేల భువిన్ మహోగ్రభయ
శ్రీగతుఁ దైనమానవుఁడు జెందక పోఁడఁట పాతభంగముల్
వేగ, నటంచు వింటి నది విశ్రుత మై నిజ మయ్యె నిప్పుడున్.

సీ॥ అన గంగ యిట్లనె నంబుజోదర నన్ను నెతప్పు చేసిన హేతువు మది
నుంచి వేగ పరిత్యజించఁ దలంచితి నేను దేహత్యాగ మిపుడు నేయఁ
బూనుదు నిర్దోషపుంబడంతిని జంపినట్టిదోషంబు నీ కగును నాథ
దోసంబు లేనట్టితోయజనేత్రను వదలినయాతఁడు వరుసతోడ
నరకములను బొందు నిరి చెడి యని శాస్త్రసమితి దెల్పు చున్నక్రమము సర్వ
సురవిభుం డవగుచు సొంపుగు ల్కెడునీకుఁ గాదొ? దీన నేల రాదొ? చక్రి.

వ॥ అనిన సిరి యిట్లనియె.

—*లక్ష్మీదేవిప్రార్థనంబుచేత నారాయణుండు శాపంబుల సమర్థించుట.*—

ఉ॥ శ్రీహరి సత్త్వరూపుఁడవు చెల్లునె నీకు మహోగ్రకోపముల్
ద్రోహము మాని నాథ కడుదుఃఖిత లౌనిజపత్నులన్ మహో
త్సాహ మెలర్పఁ గావుము ప్రసాదముఁ గైకొను మాధటన్ సుర
వ్యూహముఁ గాచునీకు క్షమ యొప్పిద మౌనుఁ గదే కృపానిధీ.

ఉ॥ క్రూరపువాణిశాపమునఁ గుందుచు నేను నుమత్కళాంశచే
భారతభూమికిం జనిన బాములఁ జెందుచు నెంతకాల మౌ

ధారుణి నుండఁ గాఁ జనును ధన్యతతో నిట కేను వెండి యుర్వ
జేరుదు నీపదాబ్జయుగసేవ లొనర్పఁ గ నెన్నినాళ్లకున్.

గీ॥ మత్కళాంశచేత మాధవ తులసినై । యెపుడు నీపదాబ్జ మెలమితోడ
జేరఁ గలను తులసిచెట్టయిన నన్నెట్టు । లుద్ధరింపఁ గల వొ యుద్ధచరిత.

వ॥ మఱియు నీగంగావాణు లొండొరుల శపించుకొన్న కతంబునం జేసి భారతంబున కేగిన నచ్చో పాపిపాపంబులు వడయుచుండి శాపపాపవిముక్తలై వెండి యు నెప్పుడు భవచ్చరణయుగళసన్నిధిఁ బడయం గలరు. నా కెఱింగింపు మని వేడుకొని మఱియు నాయరవిందమందిర సుందరునితో ని ట్లనియె.

గీ॥ ఓకృపానిధి భారతీయువతి బ్రహ్మసదనమునకును గంగను శంకరాల [యంబునకు నీవు పొమ్మంటి వది క్షమింపు।వారి నియ్యెడ నుండం గ వర మొసఁగుము.

ఉ॥ నేరిమి నీవిధిం గమలనేత్రునిఁ బ్రార్థన చేసి చేసి యా
సారసనేత్ర తచ్చరణసారసయుగ్మమునందు మూర్ధముం
జేరిచి కేశహస్తమున శ్రీహరిపాదయుగంబుఁ గట్టి దా
బోరన నేడ్చె బాష్పజలపూరము కాల్వలు గట్టి పారఁ గన్.

అప్పుడు.

ఉ॥ తామరసాలయాహృదయతాపముఁ గాంచి కృపాకులాత్ముఁడై
కాముని తండ్రి యాసుదతిఁ గౌఁగిటఁ జేరిచి కేశభార మిం
పారఁ గఁ జక్కనొత్తి నవహాససుధామధురాననాబ్జుఁడై
భామను జూచి యి ట్లనియె భక్తజనంబులఁ బ్రోచు వేడుకన్.

గీ॥ వెలఁది నీవు విన్నవించినది యు నేను। జెప్పినట్టిరీతి యొప్పిదంబు
తొలఁగి పోవ కుండ లలి నే సమర్థింతుఁ । దత్క్రమంబు వినుము తరుణి వేడ్క.

ఉ॥ భారతి తత్కళాంశమున భారతవర్షపుమధ్యభూమికిం
జేరి నదీస్వరూపమును జెందును గాతఁ జతుర్ముఖాలయం
బారజనీకరాస్య తనయర్ధపునంశమునం జనం గ నా
నీరమణీయలోకమున నెప్పటికి స్స్వయ ముండు వేడుకన్.

సీ॥ కమలాక్షి యీగంగ కడఁగి ముల్లోకంబులను పావనము చేసి ఘనత మీఱ
రా జైనయాభగీరథునిచే నీత యై భారతంబున కేగి సారసాక్షి
యప్పుడ యయ్యెడ హరునిశిరంబును బొంది తాను స్వభావపూత యయ్యు
పార్వతీపతిశిరోభాగసంస్థితిచేతఁ బరమపూతత్వంబుఁ బడయఁ గలదు

స్వయము నాయొద్ద దా నుంట జనును గంగ। నీవు నీకలచేఁ బోయి నీరజాక్షీ
తీర్థవర మగుపద్మావతీనదీస్వ।రూపమును జెందు తులసీస్వరూప మొందు.

చం॥ కలిలోఁ బంచసహ।స్రవర్షములు బోఁగా మీరుఁ దన్నిమ్నగో
జ్వలరూపంబులు వాయు మన్నికటభూవర్తిత్వముం జెంది ని
ర్మల తంగ్గకొని యంత మీరలు మహామాహాత్మ్యముంజెందఁదొ
య్యలి మత్సంగమసౌఖ్యసంపదలభూయః ప్రాప్తి మీ కబ్బెడిన్.

ఉ॥ సర్వశరీరధారులకు సంపదకుం దగుకారణంబు లీ
యుర్వరలో విపత్తులు, మహోన్నతు లయ్యవి తోల్తఁ గ్రూరతన్
బర్వక కల్గ నేర వని పండితవర్యులు వల్కుచుందు రో
పర్వశశాంక కాంతముఖి పంకజవాసిని నిక్కువంబు గన్.

శా॥ నామంత్రంబు జపించుసాధువులు స్నానం బాచరింపం గ నో
సీమంతిన్యవతంసమా తొలఁగు నిస్సీమాఘముల్ మీకు నా
ధీమంతుల్ తగ సంచరింతురు పవిత్రీభూత మై యెప్పుడున్
శ్రీమంతం బయి భారతంబు నెలఁగన్ శ్రీదేవి తద్భూమిలోన్.

గీ॥ భూమి నందుసకలపుణ్యతీర్థంబులు। పావనంబు లగుట భక్తజనుల
దర్శనంబువలన స్పర్శంబువలనను। గాని యొంటగాదు కమలనయనా.

కం॥ నాభక్తులుండుచోటులు। నాభక్తులచరణయుగము నర్తిలఁ గడుగన్
శోభితము లైనచోటులు। శ్రీభామిని తీర్థము లయి చెల్వొందు భువిన్.

కం॥ అనఁ గా నిట్లనియెను సిరి। వనజాక్షా భక్తజనులవలన ధరణి ప
జ్జనసంతతి పూతం బగు। నని పల్కితి వారిలక్షణావళిఁ జెపుమా.

కం॥ హరిభక్తిహీనమతు లగు। నరు లాత్మస్తుతిపరాయణస్వహృదయు లై
ధర శఠు లై పరనిందా। పరులై పాపాత్ము లగుచుఁ బరఁగుదురు గదే.

సీ॥ సర్వతీర్థంబు లేసాధుజనంబులస్నానావగాహనస్పర్శనములఁ
బూతంబు లగుచుండు పుడమి యు నెవ్వారిపాదరజస్సంగపావన మయి
వెలయుచునుండు నావిబుధవర్యులు భక్తినెవ్వారి దర్శింప నెలమిఁ గోరు
చుండుదు రేవైష్ణవోత్తమసంగతి పరమలాభం బౌనుఁ బ్రజలకెల్ల
నట్టిసాధులలక్షణ మానఁ దెల్పు। మన్మయంబులు తీర్థంబు లాశిలాది
మయతఁ గాంచిన దేవతల్ మహితసాధు। సార్ధ మట్టులు దర్శనసమయమునను.

వ॥ పావనము సేయ నోపరు. వారలకన్న భగవద్భక్తు లధికులు గదే యని వేడుకొనుకలుములజవరాలికి విష్ణుండిట్లనియె.

—* నారాయణుండు సాధులక్షణంబులు లక్ష్మికిం జెప్పుట. *—

సీ॥ కమలాక్షి భక్తలక్షణచయంబుల్ శ్రుతివ్యూహపురాణనిగూహితములు
పాపసంతతికథాప్రశమనంబులు భక్తిముక్తిసౌఖ్యాదిప్రమోదకరము
లతిపుణ్యములు ను గోప్యంబులు సారంబు లగుట నన్యులకుఁ జెప్పఁ గఁ బొసంగ
వంగనామణి నీవ యతిపవిత్రవు మాకుఁ బ్రాణతుల్యవు గానఁ బరమమైత్రి
తోడఁ దెల్పెదు విను మది తోయజాక్షి। విష్ణుమంత్రంబ దెవ్వానివీనులందు
గురుముఖాబ్జంబువలన నిగూహితము గఁ జొచ్చు నాతని నందుర శుద్ధుఁడనుచు.

సీ॥ ననుఁ బూజ సేయుచు నాగుణంబులు వినుచు నన్ను నుతించుచు ననుఁగొలుచుచు
సతతంబు తమమానసంబుల నాయంద తిరము గా నునిచి సుస్థిరత నిలిచి
దేహంబు మఱచి నాదివ్యమూర్తిని లోన ధ్యానించుచును కనుదమ్ములందు
నానందబాష్పంబు లధికమై క్రమ్మంగ గద్గదస్వను లయి కడుముదంబు
తోడఁ బొగడువారు తొయ్యలి మద్భక్తు। లగుదు రామహాత్ము లాత్మలందు
మహితమై తనర్చుమత్పదకైంకర్య। మాసఁగోరుచుందు రంబుజాక్షి.

ఉ॥ వారలు గోర రింద్రత యు వర్ణిత మైనచతుర్ముఖత్వముం
సారము లైనముక్తులను సంగత మై తగుసౌఖ్యసంపదల్
నీరజనేత్ర మానసము నిల్పను వారికి నెల్లకాలముం
చారుమదీయపాదజలజాతయుగార్చనమం ద క్రందు గన్.

ఉ॥ నీరజగర్భముఖ్యులు ను నీరజనేత్ర నశింత్రు మజ్జనుల్
సారమదీయభక్తి నఘసంతతిఁ బాసినవారు, నాశముల్
వారికి లే వొకప్పుడు ను, వారలు పావన మై తనర్ప నా
భారతవర్ష భూముల శుభస్థితితోఁ జరియింతు రెప్పుడున్.

కం॥ నాభక్తులు దుర్లభ మా। నాభారతవర్షజన్మ మంది తిరుగుచున్
బ్రాభవమునఁ దీర్థావళి। శ్రీభామిని పావనంబు సేయుదు రెలమిన్.

కం॥ అని యిటులు పద్మనిలయకు। ఘనవర్ణుఁడు సెప్పి పంపె ఘనకచలను భూ
మిని జన్మ మందినదులై తనరఁ గ భారతమునకు సుధామధురోక్తిన్.

సీ॥ అంత లక్ష్మీదేవి యాత్మకలాంశంబుచేత భారతవర్షభూతలమున
కేతెంచి భారతీశాపోదరీశాపమున నదీవరరూపమును గ్రహించె
తాను శ్రీవైకుంఠధామంబున నయుండి యున్య మానాత్మకలాంశమునను
ధర్మధ్వజాభిఖ్యధరణీపతితనూజ యై జనియించి యయ్యంబుజాక్షి
తులసి యనుపేరఁ బరఁగె భూతలమునందు। నంత హరిశాపమున వృక్షమై జనించె
భువనతతి పావనము చేసి పొగడు వడసి। హరిసమభ్యర్చనాముఖ్యమై యొసంగె.

శ్రీరస్తు.

శ్లో॥ శ్రీమద్యశోదాత్మజాతం శ్రితార్తిహరణోద్యమం।
వందే రాధాకుచాభోగకుంకుమాంకితవక్షసం

[ఇచట ☞ నీగుఱు తుండుస్థలముమొదలు ఈగుఱుతు మరల వేసియుండుస్థలముగనుక సందుకథ పద్యరూపముగ వ్రాసి యింతకుముందు జేర్పబడినను అది కొందఱకు సుఖబోధము కాదని మరల వచనరూపంబుగ వ్రాసి యిందు జేర్చియున్నాను]

---

☞ శ్రీనారాయణమహర్షి నారదుని కిట్లనియె, ఓనారదా పురాతనం బగునీకథ నీకుం దెల్పెదను. వినుము. ఆకథను స్మరించుకొన్నమాత్రాన సర్వపాపంబులు ను బాసిపోవును. శ్రీవైకుంఠంబునందు లక్ష్మియు సరస్వతియు గంగ యు ననువారు ముగ్గురు భార్యలు నారాయణునికిం గలరు. వీరు ముగ్గురు ను సమానప్రేమగౌరవంబులు గలిగి సంతతము శ్రీహరిసన్నిధియందుండుదురు. ఒకప్పుడుగంగాదేవి కామంబు మేరమీఱి నాథుండగునారాయణునిమోము బెళుకుజూపులఁ జిఱునగవుతోఁ గనుంగొనియె. ఆగంగాదేవిమోముఁగాంచి ప్రభు వగునారాయణుండు నలఁతినవ్వు నవ్వెను. అది గనుంగొని లక్ష్మీదేవి యోర్చుకొనియుండెను. సరస్వతి యోర్చుకొనక యాగ్రహంబుం జెందె. లక్ష్మీదేవి సత్వరూపిణి గాన నవ్వుకొనుచు నాసరస్వతికిఁ గోపశాంతి గల్గునట్లు బోధించెను. ఆసరస్వతిక్రోధపరవశయయినదిగాన శాంతిం జెందక కన్నులందు మొగంబునందు రక్తకాంతులుమీఱఁగోప వేగంబున నోడలు కంపంబునొందమాటిమాటికినధరముస్ఫురియింపఁబతింగాంచియిట్లనియె. ॥సరస్వతి॥ యోగ్యుఁడు నుత్తముఁడుసుధర్మిష్ఠుండునునగుభర్తకుఁగామినులందఱియందు సమమైనప్రీతి యుండును. ఖలుం డగువానికి నట్లుండక విపరీతంబై కనంబడుచుండు. ఓగదాధరా నీకు గంగాదేవియందధికసౌభాగ్యం బుండునట్లు తోఁచుచున్నది. ఓప్రభూ కమలాదేవియందును తత్తుల్యసౌభాగ్యం బున్నట్లు నీవు దలంచెదవు. నాయందది లేదు. లక్ష్మీదేవికి గంగతో సుసమ్మతం బగుప్రీతి గలదు. అట్లగుటంజేసియే

యాహరిప్రియ యీవిపరీతంబున సహనంబుఁ గై కొనియున్న యది. దుర్భగ నగునే నియ్యెడ జీవించుటచే నేమి ఫలంబు. ఎవ్వతె భర్తృప్రీతివంచితయో దానిజీవనము నిష్ఫలంబు. నిన్ను సత్వరూపుఁడ వనియు సర్వేశ్వరుఁడ వని యుం జెప్పెడిమనీషులు మూర్ఖులు. వారు వేదజ్ఞులు గారు. నీబుద్ధి వారలకు విజ్ఞాతంబు గాదు. అని యిట్లు పలికిన సరస్వతివచనంబులు విని క్రోధసంయుత యగునాయమం గనుంగొని శ్రీహరి తనమానసంబున నాలోచించి యాసభ వాసి వెలికిం జనియె. ఇట్లు నారాయణుండు సనినయనంతరము గంగపై రోసగించి రాగాధిష్ఠాతృదేవత యగునాసరస్వతి నిర్భయయై శ్రవణపరుషంబుగ నిట్లనియె. ఓలజ్జావిహీనురాలా నీ కింతకామంబుతిగునటవే? భర్త నీయందనురక్తుం డై యున్నవాఁ డని గర్వించెదవా యేమి? లేక నీసౌభాగ్యంబును మా కధికంబుగ నెఱింగింపం గోరెదవా? ఆహరి సూచుచుండునప్పుడ నీమానంబును చూర్ణంబుఁ గావించెదను. ఓకాంతా యాతండు నీ కేమి సేయం గలండో? చూచెదను. అతఁడు నాకు నుప్రాణనాయకుండయగు. అని యిట్లు దూషించి గంగాదేవిశిరోజంబులు వట్టి తిగియ నుద్యమింప నాసరస్వతికిని గంగకు ను మధ్యప్రదేశమున నిలిచి లక్ష్మీదేవి వాణిని నివారించెను. అప్పుడు సరస్వతి మహాకోపవతియై యాలక్ష్మినిట్లు శపియించె. ఓలక్ష్మీ నీ విట్టివిపరీతంబుఁ గనుంగొని యేమి యుం జెప్పక సభామధ్యంబున వృక్షంబువలె నిలిచి నదివలె నడ్డగించుచుండెదవు గాన నీకు వృక్షరూపంబును నదీస్వరూపంబును సిద్ధించుఁగాత. సందియము లేదు. అని యిట్లు శపియించిన నాసరస్వతి పలుకులు విని యాలక్ష్మి మరల నామెను శపియింప లేదు. కోపించుకొన లేదు. మఱి యామె దుఃఖించుచు వాణిని కరంబునం బట్టుకొని యయ్యెడ న నిలిచియుండెను. అప్పుడు కోపంబు మొగంబున నినుమడింపఁ పైపై మించుచుండునావాణిని గనుంగొని గంగాదేవి లక్ష్మీదేవితో

ని ట్లనియె. ॥గంగ॥ ఓపద్మాలయా యిది మహోగ్ర యై కానంబడుచు
న్నది. ఇది నన్నేమి సేయంగలదో చూతము. ఈవాగధిష్ఠాతృదేవత
వాగ్దుష్ట. దీనికిం గలహంబునందుఁ బ్రియంబు గలదు. ఈదుర్ముఖి తన
శక్తికొలందిగను తనయోగ్యతకొలందిగను నాతో వివాదంబు సేయ
నిమ్ము. ఓసతీ యిది స్వబలంబును పరబలంబును విశదీకరింపం దలంచె
డిని. మీర లందఱు ను మాయిర్వురకుం గలప్రభావంబును పరాక్రమం
బును దెలిసికొనుఁడు. అని యిట్లు సెప్పి యాగంగాదేవి వాణి కివ్వి
ధంబున శాపం బొసంగెను. ఓలక్ష్మి యెవ్వాతె నిన్ను శపియించెనో
యది నదీరూపంబుం జెందుంగాత. అది పాపిష్ఠు లుండుమర్త్యంబు
క్రిందికిం బోయి కలియందు వారలపాపాంశములను బొందుచుండుం
గాత. అని చెప్పిన గంగాదేవివచనములు విని సరస్వతి గంగాదేవిం
గాంచి యోసీ నీవ భూమికిం బోవఁగలవు. పాపిష్ఠులపాపములం
బొందఁగలవు. అని శపియింప నాసమయమున భగవంతుండు చతుర్భు
జు లగునలువురుపార్శ్వదులతో నయ్యెడ కేగుచెంచి సరస్వతిని కరమున
బట్టుకొని వక్షస్థలమునం జేర్చుకొని యాసర్వజ్ఞుం డావాణికిఁ బురా
తనం బయినజ్ఞానంబు నుపదేశించెను. ఆప్రభువు వారలకుం గలిగిన
శాపమునకు ను గలహామునకు ను గలరహస్యంబును వారలకెఱింగించి
దుఃఖావేశవివశ లయియుండునాకాంతలకు సమయోచితంబు లగువచ
నంబుల నిట్లనియె ॥ భగవంతుండు ॥ ఓలక్ష్మి నీవు నీకలచే ధర్మధ్వజుని
గృహమునకుఁ బొమ్ము. భూమియం దాతని కయోనిసంభవ యగుకన్యక
గాఁగలవు. అందు దైవదోషము చేత నీవు వృక్షత్వమును జెందఁగలవు.
మదంశసంభవుం డగుశంఖచూడుఁ డనుదానవనాథునికిఁ గామిని వై
య నంతరము నాకుం బత్నివిగాఁగలవు. నిక్కువము. భారతమునం
దుఁ త్రైలోక్యపావని యగుతులసి యనం బరగెదవు. నీవు నీభారతీ
శాపమున నీకలచేతఁ బద్మావతీనదివై భారతమునం బ్రవహింపుము.

శీఘ్రముగఁ బొమ్ము, ఓగంగా యనంతరము నీవు భారతీశాపముచేత
విశ్వముఁ బావనము సేయునట్టిదాన వై దేహధారులపాపముల దహింప
భారతమునకుం జనుము. సుదుష్కరం బయినభగీరథునితపముచేత
భారతమునకుం గొంపోవంబడి మహీతలమున నతిపూత వై బాగీరథీ
సమాఖ్యం బడయం గలవు. ఓప్రియురాలా నాయాజ్ఞచేత నీవు మదంశ
సంభవుం డగుసముద్రునికిని నాకలచే జనియించెడుశంతనుమహీపతికిని
దయితవు గాఁగలవు. ఓభారతీ గంగాశాపముచేత నీవు నీకలచే భార
తమునకుం జనుము. ఓవాణీ చవతులతో నాడినకలహమునకు ఫల
మనుభవింపుము. నీవు స్వయము బ్రహ్మసదనమునకుం బొమ్ము. ఆతనికిం
గామినివి కమ్ము. గంగ శివాలయమునకుం జనుంగాత. ఇయ్యెడఁ పద్మ
యే యుండుఁగాత. ఈలక్ష్మి మిగులఁ బతివ్రత. మహానుభావురాలు. మంచి
శీలముగలది. ధర్మము ప్రవర్తింపం జేయునది. ప్రతివిశ్వముల నామె
కలాంశసంభవ లయినయందఱుకాంతలు ను ధర్మిష్ఠలయి పతివ్రత
లయి శాంతస్వరూపమును, సుశీలము ను గలవా రై యుందురు. ము
వ్వురుభార్యలు మూఁడుశాలలు ముప్వురుభృత్యులు ముప్వురుబంధు
వులు నిజముగ వేదవిరుద్ధములు. వీరలు మంగళప్రదులు గారు. ఎవ్వాని
గృహమున స్త్రీ, పురుషునిపగిదిఁ బ్రవర్తించు. ఏగృహస్థుఁడు స్త్రీవ
శుఁ డై యుండు. అట్టివారిజన్మము నిష్ఫలము. వారికిఁ బ్రతిపదము
నశుభము గల్గు. స్త్రీ, ముఖదుష్ట యగునేని యు యోనిదుష్ట యగునేని
యుఁ గలహప్రియ యగునేని యు నట్టిదానిభర్త యరణ్యమునకుఁ
బోఁజను. గృహమునకం టె మహారణ్యము వర మై యుండు. ఆయర
ణ్యమున వారలకు జలములు ను స్థలములు ను ఫలములు ను సంతత
ము సులభములు. క్రూరనార్యధిష్ఠిత మయినయింట నవి సులభములు
గావు. పురుషులకు దుష్టస్త్రీలసన్నిధియందు వాసము బహుదుఃఖా
వహం బై యుండు. అంతకం టె నగ్నియం దుండుట యుత్తమము.

హింసకజంతువులదగ్గఱ వసించుటసుఖకరము. ఓవరాననా పురుషులకు వ్యాధిజ్వాల యు విషజ్వాల యు నుత్తమము లనవచ్చు. దుష్టస్త్రీల ముఖజ్వాల మరణమునకంటె నతికఠోరమై యుండు. స్త్రీజితుం డగు పురుషునిజీవితము నిష్ఫలము. నిక్కము. వాఁ డొనరించినకర్మము ఫలము నొసంగదు. వాఁ డియ్యెడ నంతట నిందితుం డై పరమున నరకమునొందు. యశఃకీర్తివిహీనుం డగు. వాఁడు జీవించియున్నను మృతుండయగు. అగ్నులు ను చవతులు నొక్కయెడ నుండిన శ్రేయము చెడు. ఒకభార్య గలవాఁడు సుఖముఁ బడయు. పెక్కండ్రుభార్యలు గలవాని కొకప్పుడు ను సుఖము లేదు.ఓగంగా నీవు శివాలయమునకుం బొమ్ము. ఓసరస్వతీ నీవు చతుర్ముఖునియింటికిం జనుము. సుశీల యగు కమలాలయ యియ్యెడ నాయింట నుండుఁగాత. ఎవ్వానిపత్ని సుఖసాధ్యయయి సుశీలము గలిగి పతివ్రత యైయుండు. అతని కిహంబున స్వర్గసుఖము ను పరము న ధర్మమోక్షములు ను గలుగు. ఎవ్వానికిఁ బతివ్రత పత్ని యగునో? వాఁడు ముక్తుండు ను శుచి యు సుఖి యు నై యుండు. దుశ్శీలముగలది యెవ్వానికిఁ బత్ని యగు; వాఁడు జీవన్మృతుండు అశుచి దుఃఖి యు నై యుండు. ఓనారదా యిట్లు వచియించి జగత్పతి యూరకుండ నాలక్ష్మీవాణీగంగ లొండొరుల నాలింగనము చేసికొని పెద్దపెట్టున నేడ్చిరి. ఇట్లు కొంతతడవు రోదనము చేసి యాకాంతలు శోకమునం గన్నుల బాష్పము లురుల నంగములు వడంక భయము పైకొనం జేయునది యెఱుంగక చింతాసంతాపదంతురితస్వాంత లై యాలోచించి క్రమముగ నాజగత్పతి కిట్లనిరి. అందు సరస్వతి యోనాథా నాయపరాధము క్షమింపుము.దుష్టురాల నగునన్ను దండింపుము. ఎట్టిస్త్రీ లైన నుత్తమకాంతునిచేఁ బరిత్యక్త లయి రేని యెయ్యెడ జీవింపఁగలరు. యోగముచేత భారతమున దేహత్యాగముఁ జేసికొనియెదను. అత్యుచ్ఛ్రితుఁ డగువాఁడు నిశ్చయముగ నిపాతము

నొందుదునుగదా? అని చెప్పినగంగ యిట్లనియె. ఓజగత్పతీ యేయపరాధముచేత నన్ను నీవు పరిత్యజించెదవు. నేను దేహత్యాగమొనరించెదను. నిర్దోష యగుదానిం జంపినపాపము నీవు జెందెదవు. సంసారమున నెవ్వండు నిర్దోష యగుకామినిం బరిత్యజించు ; కల్పకాలము వాఁడు నరకమున నుండు. సర్వేశ్వరుండ వగునీకేమి? అని చెప్పిన లక్ష్మీదేవి యిట్లనియె. ఓనాథా నీవు సత్త్వస్వరూపుఁడవు. నీకుం గోపమెట్లుగల్గె. ఔరా యిది యాశ్చర్యము. భార్యలవిషయమున ననుగ్రహమొనరింపుము. ఉత్తముఁడగుపతికి నోర్పు వరము గాదె? భారతీదేవి శాపమున నేను నాకలచే భారతమునకుం జనియెద నేని యయ్యెడ నెంత కాల ముండంగలను. నీపాదారవిందముల మరల నెప్పుడు గాంచంగలను. పాపిష్ఠులు నాయందు స్నానముసేయ నవగాహన మొనరించి తమపాపముల నాకర్పింతురుగదా? ఆపాపముల నేకారణమునం బాసి నీపదములఁ జెందెదను. ఓయచ్యుతా నేను నాకలచే ధర్మధ్వజునికిఁ గూఁతురనై తులసియనఁ బరఁగి నీపాదారవిందముల నెప్పుడు గాంతును. ఓకృపానిధీ నేనువృక్షరూపిణి నయి దానికధిష్ఠానదేవత నయ్యెదనుగాదే? అట్టినన్నెపు డుద్ధరింపఁగలవు. అది నాకుఁ దెల్పుము. సరస్వతీదేవిశాపముచేత గంగాదేవి భారతమునకుం జనియెనేని శాపపాపవిముక్త యయి యాదేవి నిన్నెప్పుడు జెందఁగలదు. సరస్వతీదేవి గంగాశాపముచేత భారతమునకుఁ జనియెనేని శాపవినిర్ముక్త యయి నీపదము నెప్పుడు చెందఁగలదు. ఓనాథా ఆవాణిని బ్రహ్మసదనమునకును గంగను శివసదనమునకును బొమ్మని చెప్పినవచనమును క్షమింపుము. అని యిట్లు పల్కి కమలాదేవి తనకాంతునిపాదములు పట్టుకొని నమస్కరించి తనకేశభారమున నాతనిచరణములు బంధించి మాటిమాటికి రోదనము సల్పెను. అప్పుడు పద్మనాభుఁడు పద్మాలయాదేవిని తనవక్షమున సునిచికొని స్మితసుధామధుర మయినమోమునఁ

ప్రసన్నత్వము దోఁప భక్తానుగ్రహకాతరుఁ డయి యిట్లనియె. ॥నారా యణుఁడు॥ ఓసురేశ్వరీ నీ చెప్పినవచనమును నా చెప్పినవచనమును భ్రంశము నొందక సమమై యుండునట్లుగ నాచరించెదను. ఆక్రమము వినుము. భారతీదేవి తనకలచే సరిద్రూపముఁ దాల్చి భారతమునకుఁ జనునది. ఆవాణి తనయర్ధాంశముచేత బ్రహ్మసదనమునకుం జనునది. ఆసరస్వతి స్వయము నాగృహమున నుండఁ జను. ఆగంగ త్రిభువనములను పవిత్రములు సేయుటకు భగీరథునిచేఁ గొంపోవఁబడి భారతమునకుఁ జనఁ గలదు. ఆగంగ స్వయము నాయింట నుండఁ జను. అయ్యెడన యాగంగ దుర్లభ మయినచంద్రమౌళిశిరముం బొంది యామె స్వభావమునఁ బూత యయ్యు నంత నతిపవిత్రురా లగును. ఓకమలాలయా నీవు నీకలాంశాంశములచేత భారతమునకుఁ జని పద్మావతి యనుసరిద్రూపమును, తులసి యనువృక్షస్వరూపమును దాల్పుము. సరిద్రూపములు దాల్చిన మీకుఁ గలియందు నైదువేలయేండ్లకు విమోక్షణమును మరల మద్గృహప్రాప్తియుఁ గలుగును. సర్వశరీరధారులకును విపత్తి సంపదలకు హేతుభూత మై యుండు. ఓపద్మా సంసారమునందు విపత్తి వినాగా నెవ్వరికి మహిమము గల్గు? నామంత్రము నుపాసించుసాధువులు స్నానము సేయుట కవగాహన మొనర్చుటంజేసి మీకుం బాపిష్ఠుల సంస్పర్శమువలన నైనపాపములు దొలఁగు. ఓసుందరీ పృథివి యందుం గలయసంఖ్యాతము లగుతీర్థములు మద్భక్తజనులదర్శనస్పర్శనములవలనఁ బూతము లగును. ఓసతీతిలకమా మదీయమంత్రము నుపాసించుభక్తులు భారతమును పవిత్రము సేయ నందు సంచరించుచుండుదురు. వారు మహాపవిత్రులు. అతిమనోహరులు. నాభక్తులెచ్చోటనుండుదురో? వార లెచ్చోటఁ బాదములు గడుగుకొనుదురో? ఆచోటు సుపవిత్ర మగుమహాతీర్థ మయి వెలయు. నిజము. స్త్రీని జంపినవాఁడైనను గోఘ్నుఁడైనను కృతఘ్నుఁడైనను బ్రహ్మహత్య యొనరించినవాఁడైనను గురుతల్పగుండైనను నాభక్తుల స్పృశించుట

చేతను దర్శించుటచేతను మహాపవిత్రుఁడై జీవన్ముక్తుఁడగును. ఏకాదశీవ్రతము ననుష్ఠించనివాఁడయ్యును సంధ్యావిహీనుండయ్యును నాస్తికుండయ్యును నరఘాతియయ్యుఁ బరిపూతుం డగును. శస్త్రజీవియు ధావకుండును శూద్రయాజకుండును వృషవాహుండును మద్యభక్తజనస్పర్శనదర్శనములఁ బూతత్వము నొందు. విశ్వాసఘాతియు మిత్రఘాతియు మిథ్యాసాక్ష్యము సెప్పినవాఁడును స్థాప్యము హరించినవాఁడును మద్యభక్తస్పర్శదర్శనములవలనఁ బూతు లగుదురు. మద్యభక్తస్పర్శదర్శనమువలన ఋణగ్రస్తుండును వార్ధుషికుఁడును జారజుఁడును పుంశ్చలీపతియు పుంశ్చలీపుత్రుండును పవిత్రు లగుదురు. శూద్రుల యిండ్లలో వండువాఁడును దేవలుఁడును గ్రామయాజకుఁడును అదీక్షితుఁడును అశ్వత్థవృక్షమును ఖండించినవాఁడును నాథభక్తుల నిందించువాఁడును నివేదనము సేయకభుజించువిప్రుఁడును నాథభక్తులఁ గాంచినను స్పృశించినను పరిపూతత్వంబు నొందుదురు. తల్లిని తండ్రిని భార్యను భ్రాతలను కుమారుని కూఁతును గురుకులమును భగినిని వంశహీనుం డగు భాంధవుని శ్వశ్రూశ్వశురులను స్వీకరింపనివారలును దేవద్రవ్యాపహారియు విప్రద్రవ్యాపహారియు లాక్షాలోహరసముల విక్రయించువారలును కన్యావిక్రయము సేయువారును శూద్రశవముల దహించువాఁడునుమహాపాతకులు. అట్టివారును నాథభక్తజనులదర్శనస్పర్శనములవలనఁ బూతత్వముఁ జెందుదురు. అని చెప్పిన విని లక్ష్మీదేవి యిట్లనియె. ఓభక్తానుగ్రహకారకుఁడా భక్తులలక్షణముఁ దెల్పుము. వారలసందర్శనముచేతను సంస్పర్శముచేతను నరాధములు సయితము తక్షణమునఁ బరిపూతు లగుదురుగదా? హరిభక్తివిహీనులును ధూర్తలును మహాహంకారసంయుతులును ఆత్మస్తుతిపరాయణులును శఠులును సాధునిందకులును నరాధములు. ఎవ్వారు స్నానముసేయుట కవగాహనము రచించుటచేత సర్వతీర్థములు పావనము లగునో? ఎవ్వారి

పాదోదకమువలనను పాదరజమువలనను భూమి పరిపూత యగునో? భారతమున నెవ్వారిదర్శనస్పర్శనములను దేవతలుసయితము కోరుదురో? అట్టివైష్ణవులసమాగమము ఎల్లవారికిని బరమలాభ మయియుండు. అమ్మయము లగుతీర్థములును మృచ్ఛిలామయము లగుదేవతలును విష్ణుభక్తులవలెఁ దక్షణమునఁ బావనము సేయలేరు, మఱి వారు బహుకాలమునకుఁ బరిపూతులం జేయుదురు. అని యిట్లు లక్ష్మీదేవి చెప్పిన వచనములు విని లక్ష్మీకాంతుఁడు మందహాసముతో నిగూఢ మగుతత్త్వము సెప్ప నుపక్రమించెను. ॥నారాయణుఁడు॥ ఓలక్ష్మీ భక్తులలక్షణములు శ్రుతులందుఁ బురాణములందు గూఢములై యుండు. అవి పుణ్యస్వరూపములు. పాపసంహారకములు. సౌఖ్యదములు. భక్తిముక్తిప్రదములు. సారభూతములు. గోపనీయములు. ఖలులకుఁ జెప్పఁగూడనివి. నీవు పవిత్రవు. ప్రాణతుల్యురాలవును గానఁ దెల్పెదను. వినుము. ఎవ్వనిశ్రవణమునందు గురుముఖమువలన విష్ణుమంత్రముప్రవేశించునో యాతనిని పవిత్రుఁ డగునరోత్తముఁ డని వేదవేదాంగములు వల్కుచున్నవి. అట్టివానిపూర్వపురుషులు నూర్వురు తమకులమున నట్టిపవిత్రుండు జన్మించినమాత్రముచేత స్వర్గముననుండినను నరకముననుండినను వానిం బాసి ముక్తి బొందుదురు.. ఎవ్వారెవ్వారే యేయోనులందుజన్మము నొందియుండెదరో ? ఆయాపురుషులు సయితము కాలమున పూతత్వమునొంది జీవన్ముక్తులయి శ్రీహరిపదమును జెందెదరు. మదీయమయినభక్తి గలిగి మదీయ మయినపూజయందు నియుక్తుఁ డగుచు మదీయములగుగుణములు ధ్యానించుచు నాగుణములను శ్లాఘించుచు సతతము మన్నిష్ఠులై నాగుణములు విన్నమాత్రాన నానందములును పులకలును వెలుంగ గద్గదిక వొడమినకంఠమును ఆనందాశ్రువులు ప్రవహించు నేత్రములును గల్గెడువారు నాభక్తులు. వారలు సుఖమును సాలోక్యాదిమోక్షచతుష్టయమును బ్రహ్మత్వ

మును అమరత్వమునుగోరరు. వారలు మత్సేవనమునే గోరుదురు వారు ఇంద్రత్వమును. మనుత్వమును సుదుర్లభమైన దేవత్వమును స్వర్గరాజ్యాదిభోగములును స్వప్నమునన్నైనను వాంఛింపరు. బ్రహ్మాదులగు దేవతలు వినాశమునొందుదురు. కల్యాణమగుమద్భక్తి గలవాఁడు నాశము నొందఁడు. మద్భక్తులు సుదుర్లభమయినభారతభూజన్మము నంది భారతమునం బరిభ్రమించెదరు. ఆనరులు భూమిని పావనము గావించి నాయాలయమున కేగుదెంచెదరు. ఓపద్మా యిది సర్వము నీకెఱింగించితిని. యథోచితముగఁ బ్రవర్తింపుము. అనిన నాకాంత లాహరియాజ్ఞానుసారముగ నడిచిరి.

ఇది బ్రహ్మవైవర్తమహాపురాణమునందు ప్రకృతిఖండంబున
నారాయణనారదసంవాదంబున సరస్వత్యుపాఖ్యాన
మను నాఱవయధ్యాయము.

శ్రీరస్తు.

బ్రహ్మవైవర్తమహాపురాణము. ప్రకృతిఖండము.

# శ్రీతులస్యుపాఖ్యానము.

నారదుఁ డిట్లనియె. సాధ్వియు నారాయణునికిఁ బ్రియురాలు నగునాలక్ష్మి యెట్లు తులసియయ్యెను? ఎచ్చట జన్మించెను? ఆమె పూర్వజన్మమున నెవ్వతె? ఆమె ఎవ్వనికులమునఁ బుట్టినయది? ఆతపస్విని యెవ్వని కన్యక? ఆమె యేతపంబు చేసి ప్రకృతికంటెం బరుండును నిర్వికల్పుఁడును నిరీహుండును సర్వసాక్షిస్వరూపుఁడును పరబ్రహ్మమయుఁడును పరమాత్మస్వరూపుఁడును ఈశ్వరుండును సర్వారాధ్యుండును సర్వేశ్వరుండును సర్వజ్ఞుండును సర్వకారణకారణుఁడును సర్వాధారుఁడును సర్వమయుండును సర్వరక్షకుండును నగునారాయణునిం బొందెను? ఇట్టిదేవి యెట్లు వృక్షత్వంబుఁ బొందెను? ఆతపస్విని యెట్లసురునిచే నాక్రమింపంబడియె? ఇందు సందియంబు నొందుచు నామనము లోలమై పలుమాఱు నన్నుఁ బ్రేరేపించుచున్నయది. సర్వసందేహములను బోనడఁచునో నారాయణమహర్షి నీవు నాసందేహములఁ బాపం దగుదు వనియడిగిన నారాయణమహర్షి యానారదుని కిట్లనియె.

తులసితండ్రియగుధర్మధ్వజునివంశక్రమము.

దక్షసావర్ణి యనుమనువు పుణ్యవంతుఁడు ను వైష్ణవుఁడు ను శుచియు యశస్సంపన్నుఁడు ను కీర్తిమంతుఁడు నైనవాఁడు. అతఁడు విష్ణునియంశముచే సంభవించినవాఁడు. ఆతనిపుత్రుఁడు ధర్మసావర్ణి యనువాఁడు ధర్మిష్ఠుఁడు ను వైష్ణవుఁడు ను శుచియు నై యుండెడివాఁడు. ఆతనిపుత్రుఁడు విష్ణుసావర్ణి యనువాఁడు. అతఁడు వైష్ణవుఁడు ను జితేంద్రియుఁడు నగువాఁడు. అతనిపుత్రుఁడు దేవసావర్ణి

యనువాఁడువిష్ణువ్రతపరాయణుఁడు.అతనిపుత్రుఁడు రాజసావర్ణి యను వాఁడు మహావిష్ణుభక్తుఁడు, ఆరాజసావర్ణికుమారుఁడు వృషధ్వజుఁ డనువాఁడు వృషధ్వజునిభక్తుండు. శంభు వాతనియాశ్రమమునందు మూఁడుదేవయుగములు వసియించియుండెను. శివునికి నారాజునం దుఁ బుత్రునికంటె నధికమయినప్రీతి గలదు. ఆవృషధ్వజుఁడు నారా యణుని లక్ష్మిని సరస్వతిని గారవింపనివాఁడు. మఱి యాతఁడు సర్వ దేవతలపూజనములు దూరీభూతములు గావించె.మదమతిశయించియా రాజు భాద్రపదమాసమునఁ బ్రవృత్త మగుమహాలక్ష్మీపూజనమును ఖండించి మాఘమాసమునఁ బ్రవర్తింపంబడుసరస్వతీపూజనంబును నిలిపివేసెను. అతఁడు యజ్ఞమును విష్ణుపూజనమును నిందించి తా నవి సేయక యుండె. శివుఁ డాతనియందుఁ బ్రీతుండై యుండుటం జేసి యేసురలు ను ఆరాజేంద్రుని శపింప రైరి. దివాకరుఁ డారా జును శ్రీవిహీనుఁ డగునట్లు శపియించె. అది యెఱింగి శంకరుఁడు శూలముఁగైకొని సూర్యునిపైకిఁ బోవుడు దిననాథుఁడు తనతండ్రి యగుకశ్యపునిఁ దోడుకొని బ్రహ్మలోకమునకుం జని యానలువను శరణుచొచ్చెను. శివుఁడు ను క్రోధముచే త్రిశూలము హస్తము నఁ దాల్చి బ్రహ్మలోకమునకుఁ బోవ బ్రహ్మ యు భయభ్రాంతుఁడై సూర్యుని మున్నిడుకొని వైకుంఠమునకుఁ జనియె. అంత శంకరుం డు శూలముఁ దాల్చి తాను సూర్యుని వెంబడించి పరుగిడ బ్రహ్మ యుఁ గశ్యపుఁడు ను సూర్యుండు ను సంత్రాసము నొందుచుఁ దాలు వులఁ దడి యెండఁ గా సర్వేశ్వరుఁ డగునారాయణుని శరణు చొచ్చిరి. వారలుశిరములు వంచి హరికిఁబ్రణామములుగావించి మాటి మాటికి సంస్తుతులు సల్పి యందఱును తమభయములకుఁ గారణము విన్నవించుకొనఁ గా నారాయణుఁడు కృపాయత్తచిత్తుఁడై వా రల కథయ మొసఁగి యోభీతులారా మీరు స్థైర్యమున నుండుఁడు

నేనుండఁగా మీకు భయ మెక్కడిది? ఎవ్వరు విపదము సంభవించి నప్పుడు భయముఁ జెంది నన్ను సంస్మరించెదరో వారలను వారుం డుచోటికిఁ జక్రాయుధుండనై వేగం బచని రక్షించుచుండుదును. ఓదేవతలారా నేను జగములకుఁ బాలకుఁడను. నేను నిరతము సృష్టి కర్తను. బ్రహ్మస్వరూపమున సృజించెదను. శివరూపమున సంహారిం చెదను. నేన శివుఁడను. బ్రహ్మ వగునీవును నేన. త్రిగుణాత్మకుఁ డగు సూర్యుండు ను నేన. నానారూపములం దాల్చి సృష్టిని పరిపాలిం చుచున్నాఁడను. మీరలు పొండు. మీకు శుభ మగును. భయము మీ కేల? ఇది దొట్టి నావరముచేత శంకరునివలనిభయము మీకు లేదు. భగవంతుం డగునాశంకరుండు శీఘ్రము గ సంతోషము నొందువాఁడు. అతఁడు సత్పురుషులకు గతి యగువాఁడు. సుదర్శన చక్రమునందును శివునియందును నాకు నాప్రాణములకంటెఁ బ్రియ మధిక మై యుండు. ఈయిలువురకంటెఁ దేజస్వి యగువాఁడు బ్రహ్మాండముల లేఁడు. మహాదేవుఁడు లీలమెయి గోటిసూర్యుల నైనను సృజియింప శక్తుఁడు. ఇట్టిబ్రహ్మలను కోటిసంఖ్యల నైనఁ గలిగించును. ఆశూలి కసాధ్య మేమి యున్నది? నన్ను దివానిశము ధ్యానించు చుండుటంజేసి యాతనికి బాహ్యజ్ఞాన మొకించుక యుండదు. అతఁ డు భక్తితో నానామములను నాగుణముల నైదు మొగములచేఁ గీ ర్తించుచుండు. నేను నిట్లాతనికిఁ గల్యాణము గలుగనగు నని చింతిం చుచుందును. ఎవ్వరు న న్నెట్లు జెందెదరో వారల నే నట్లు భజియిం చెదను. ఆభగవంతుఁడు శివస్వరూపుఁడు. శివమున కధిదేవత. అతని వలన శివమగును. కాన బుధు లాతని శివుఁ డని పల్కుదురు. అని చెప్పుచుండఁగా నాసమయమున శంకరుఁడు శూలమును కేలం గీలిం చి వృషభారూఢుఁ డై రక్తపంకజములకు సమానము లగులోచన ములతో సద్యోదకుం జనుదెంచి తూర్ణముగ వృషభవాహనము డిగ్గి

భక్తివినమ్రం బయినకంఠముతోఁ బరాత్పరుఁడు ను శాంతుండు నయినలక్ష్మీకాంతునికి నమస్కరించెను. ఇట్లు రత్నమయభూషణభూషితుఁడయి; కిరీటమును, కుండలములను, వనమాలయు, చక్రాయుధమును దాల్చి; నవీననీరదమున కొప్పయినశ్యామసుందరవిగ్రహముతోఁ జతుర్భుజములతోఁ జందనం బలఁదినసర్వాంగములతోఁ బీతాంబరముతోఁ బొడసూపుచు; లక్ష్మీదేవి యందిచ్చుతాంబూలము భుజియించుచు; మందస్మితసుందరముఖారవిందుఁడై విద్యాధరకాంతలు సేయునర్తనము సూచుచు చతుర్భుజు లగుపార్షదులు వింజామరములు వీచుచుండ రత్నసింహాసనమున వేంచేసియుండునాపరమాత్మునికి భక్తానుగ్రహవిగ్రహుం డగువానికి నమస్కృతు లొనరించి యామహాదేవుండు బ్రహ్మకును ప్రణామంబుఁ గావించె. సూర్యుండును సంత్రస్తుం డగుచు భక్తితోఁ జంద్రశేఖరునికి నమస్కరించెను. కశ్యపుఁ డాతని నతిభక్తితో సంస్తుతించి నతి యొనరించె. శివుండు సర్వేశ్వరుని సంస్తుతించి మణిమయాసనంబునం గూరుచుండెను. ఇట్లున్నతాసనంబునందు సుఖాసీనుం డై విశ్రమించి యుండుచంద్రశేఖరునికి విష్ణుపార్షదులు డగ్గరి శ్వేతచామరంబులచే మందమారుతంబు లొలయవీచుచుండిరి. సత్త్వమయునిసంసర్గంబునఁ గ్రోధం బడఁగి ప్రసన్నుండయి ముదంబునమందస్మితంబుతో నాశంకరుండు పంచవక్త్రంబులను పరుండు ను విభుండు నగునారాయణుని స్తుతించుచుండెను. నారాయణుండు ప్రసన్నాత్ముం డగుచు సుధామధురంబులు మనోహరంబులునగువచనంబులతో దేవసభయందు భగవంతుండగునాచంద్రశేఖరునితో నిట్లనియె. ఓమహాదేవా శివుఁడ వగునిన్ను గుఱించి శివప్రశ్న మొనరించుటయత్యంతమపహాస్యమగును. అట్లయ్యును శివప్రశ్నము సేయుట లౌకిక మనియు వైదికమనియు సేయుచున్నాను. తపములకు ఫలము లొసంగువాఁడవై సర్వము లగుసంపదల నిచ్చుచుండునట్టినిన్ను గుఱించి సంపత్ప్రశ్నము

తపఃప్రశ్నము సేయుట యయోగ్యము. జ్ఞానాధిదేవత వయి సర్వజ్ఞుఁడ వగునిన్ను వృథా జ్ఞానప్రశ్న మేల సేయవలయు? మృత్యుంజయుఁడవైననీకు విపత్తులేనికాలమున నాప్రశ్నము వలదు. నీయింటికి నీవు వచ్చినప్పు డేలవచ్చితి వని ప్రశ్నము సేయుట నాకనుమతముగాదు. అయినను నీవు త్రాసముతో నియ్యెడకువచ్చుటకుం గారణ మేమి యని యడుగవలసియున్నది, అందుకుఁ గారణముఁ దెల్పుము.

అని యడిగిన మహాదేవుం డిట్లనియె. ఓహరీ నాభక్తుండు ను నాకు నాప్రాణములకంటె నధికప్రియుండు నగువృషధ్వజుని సూర్యుండు శపియించెనని నాకుం గోపముసు ద్రాసమును గల్గి యున్నది. భక్తునందలిపుత్రవాత్సల్యమున నైనశోకముచేత సూర్యునిం జంపుటకుం గడంగితిని. ఆతఁడు బ్రహ్మను శరణుచొచ్చెను. ఆబ్రహ్మ సూర్యునిం దోడ్కొని నిన్ను శరణుచొచ్చియున్నవాఁడు. ఏనరులు ధ్యానంబున నైన వచనముల నైన నిన్ను శరణువేడెదరో; వారలు విపత్తు గడచి శంకావివర్జితు లై మృత్యువును జయింతురు. అట్లుండ నిన్ను సాక్షాచ్ఛరణము జెందినవారలఫలం బేమని పొగడుదును. హరిస్మరణం బెల్లప్పుడునభయం బొసంగునది. సర్వమంగళములు ను దానం గలుగు. ఓజగత్ప్రభూ సూర్యునిశాపంబుకతమున సిరి చెడి మూఢుం డై యుండు నాభక్తునికిఁ గాఁగలగతి యేమి? నాకది వచియింపుము. అని యడిగిన భగవంతుం డిట్లనియె. ఈవైకుంఠమున నర్ధక్షణమునకు భూమియందు నిరువదియొక్కయుగములకాలము దైవముచే నతీతంబయ్యె. వేగంబ నృపాలయమునకుం జనుము. దుర్నివారము ను మహాదారుణము నగుకాలముచేత వృషధ్వజుండు మృతుం డయ్యె. ఆతనికుమారుండు హంసధ్వజుండు ను సిరిచెడి యుండి మృతుం డయ్యె. ఆతనిపుత్రులు ధర్మధ్వజుండు ను కుశధ్వజుండు ననుమహాభాగులు సూర్యునిశాపమున హతశ్రీకు లయి రాజ్యభ్రష్టు లగుచు లక్ష్మినిగూర్చి తపము సల్పెదరు.

కాలభార్యలయందు లక్ష్మి యాత్మకలాంశమున జనియించును. అప్పుడు వారలు సంపద్యుక్తు లయి నృపోత్తము లగుదురు. ఓశంభూ నీసేవకుండు మృతుం డయ్యె. పొమ్ము. ఓబ్రహ్మాదులారా మీర్లు ను పొండు. అని యిట్లానతిచ్చి నారాయణుండు లక్ష్మితో సభనుండి యభ్యంతరంబునకుం జనియె. దేవతలు ను శంభువు ను సంప్రాప్తు లయి పరమము లయినతమతమయాశ్రమములకుం జనిరి. శివుండు ను శీఘ్రమునం బరిపూర్ణతమముగం దపంబు సేయం జనెను.

ఇది శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణమునం బ్రకృతిఖండమునందు
నారాయణనారద సంవాదమునం దులస్యుపాఖ్యాన
మునం ద్రయోదశాధ్యాయము ముగిసెను.

## కుశధ్వజసుత యగు వేదవతిచరిత్రము.

నారాయణమహర్షి యిట్లనియె. ఓనారదమునీ యాధర్మధ్వజుండు ను గుశధ్వజుండు నుగ్రం బయినతపముచేత లక్ష్మీదేవి నారాధించి వారలు వేర్వేఱ దమ కిష్టము లయినవరములు వడసిరి. ఆధర్మధ్వజకుశధ్వజులు మహాలక్ష్మి వరముచేతం బృధ్వీపతు లయి ధనము గలిగి పుత్రవంతులైరి. అందు కుశధ్వజునిపత్ని మాలావతి యనుదేవి. ఆసతి కొంతకాలమునకు లక్ష్మ్యంశసంభవయు సతి యునగుసుతం గనియె. ఆమె భూమిపతనం బడినంతట న జ్ఞానయుక్త యయి యందఱు ను వినునట్లు స్పష్టముగ వేదధ్వనిం గావించి సూతికాగృహమునుండి వెలువడియె. ఆకన్యక జనించినయంత న వేదధ్వనిం గావించెం గాన మనీషులాకన్యకను వేదవతి యని పల్కుదురు. ఆమె జనియించినంత న బాగుగ జలకం బాడి తపముసేయ వనమునకుం జనియె. నారాయణపరాయణ యయి యామె యెల్లవారు నిషేధించినను వినక వారలప్రయత్నములు వమ్ము చేసి చనియె. ఆవేదవతి పుష్కరక్షేత్రమునందు తపముసేయం బూని యొకమన్వంతరము లీలమెయి నత్యుగ్ర మగు

తపము సలిపె. అట్లయ్యు ను పుష్టయై క్లేశము నొందక నవయౌవన సంయుత యై వెలుంగుచుండె. ఇట్లుండ నామెకు "ఓసుందరీ నీకు జన్మాంతరమునందు శ్రీహరి తాన భర్త యగును. బ్రహ్మాదులచేత దురారాధ్యుండగుపతిని నీవు వడయంగలవు" అని యాకాశవాణి వినంబడియె. ఆయాకాశవాణివచనములు విని యు నాయమ రోషంబుతో గంధమాదననగమునకుం జని యచట నొకనిర్జనస్థలమున మరలం దపంబు సేయుటకుపక్రమించెను. అచటం జిరకాలము తపముగావించియుఫలం బందక నిట్టూరుపునిగుడించుచుం గూరుచుండి యెదుట దుర్నివార్యుండగు రావణునింగాంచి యతివినయభక్తులతో నాతనికింబాద్యంబొసంగి యాస్వాద్యము లగుఫలములు మూలములు ను సుశీతలము లయినజలములు నిచ్చెను. అవి భుజియించి యాపాపిష్ఠుండు తా నాయమసమీపమునకుం జని ఓకల్యాణీ నీ వెవ్వతెవు? అని యడిగి పీనోన్నతము లగు పయోధరములును శరత్పంకజమువలె నుత్సవముం గల్పించు మొగంబును గలిగి మందహాసము సల్పు సుదతియుసతియు నగునావరారోహం గాంచి కామబాణములచేం బీడితుం డై యాకృపణుండు మూర్ఛం జెంది తెలిసి యాకన్యకం గరమువట్టి తిగిచి శృంగారచేష్టలు సేయం గడంగిన నాసతి కోపదృష్టిం గనుంగొని వానిని స్తంభితునిం గావించె. ఆరావణుఁడు హస్తములు ను పాదములు ను గదలింప లేక యేమియుం జెప్ప నశక్తుండయి పద్మాంశసంభవ యగునాపద్మలోచనను మానసమున స్తుతియించెను. ఆదేవి యు నాతఁడు సల్పిన స్తవమున సంతుష్ట యయి యాతని స్తబ్ధత్వమును మాన్చి వానింగాంచి యోరీ నీవు నాకతమున బాంధవులతో వినాశము నొందఁబోయెద వని శపియించి యోరావణా నీవు నన్ను స్పృశియించితివి గాన నీశరీరమును బరిత్యజించెదను కనుంగొనుము అని చెప్పి యోగబలమున నాసుదతి శరీరముం బరిత్యజించినం జూచి రావణుం డామెమేనును గంగయందు

వదలి తనగృహమునకుం జనియె. ఆయసురుండది గాంచి తనమనమున
నౌరా! యేమి యద్భుతముఁ గంటిని! నే నెట్టికార్యముఁ గాంచితిని!
అని చింతించి చింతించి యది దలంచి పలుమారులు విలపించుచుండెను.
ఆవేదవతి కొంతకాలమునకు జనకరాజునకుం దనూజయై జన్మించి
సీతాదేవి యని విఖ్యాతిం జెందె. ఆమెకొఱకె రావణుండు నిహతుం
డయ్యె. మహాతపస్విని యగునాయమ పూర్వజన్మమునం జేసినతప
ముచే హరిస్వరూపుఁడును బరిపూర్ణతముఁడు నగురాముని భర్తగాఁ
బడసెను. లక్ష్మీస్వరూపిణి యగునాసుందరి జగత్పతిని దపముచే నారా
ధించి యాతని స్వామిగాఁ బడసి యారామునితో చిరకాలము రమి
యించెను. ఆమె జాతిస్మర యగుటంజేసి తొలుతం జేసినతపఃక్లేశ
మును దలంచుకొనుచుండినను సుఖం బనుభవించుటంజేసి యదిమాను
కొనియె. దుఃఖమునకు సుఖము ఫలంబుగదా? ఆసతి యు బహు
సుకుమారుండు ను నవయౌవనుండును గుణవంతుఁడు ను రసికుండు ను
శాంతుండు ను మనోహరవేషము గలవాఁడు నుత్తముఁడు ను స్త్రీల
కు మనోహరుఁడు ను తాను గోరినప్రకారముగ నుండువాఁడు నగునా
రామునితో నానావిధశృంగారసౌఖ్యముల ననుభవించుచుండె. బలవం
తంబయినకాలంబుచేత నారాముఁడు వనవాసము సేయం బోయి
సముద్రమునొద్ద సీతతోడ లక్ష్మణునితోడ వసించియుండి యాహరి విప్ర
రూపంబుఁ దాల్చి వచ్చినయగ్నిదేవునిం గాంచెను. ఆబ్రాహ్మణుఁడు
ను దుఃఖితుం డయినరామునిం గాంచి తాను ను దుఃఖించుచు నాసత్య
పరాయణుండు సత్యములు నిష్టములునగువచనముల నిట్లనియె.॥వహ్ని॥
ఓభగవంతుఁడా నావాక్యము వినుము. కాలానుసారముగ నీకొకటి
సంప్రాప్తమయి యున్నది. ఇది సీతాహరణకాలము. ఇది నీకు సము
పస్థితం బయి యున్న యది. విధి దుర్నివార్యము. విధికంటెం బరం బయిన
బలము గలది లేదు. ఇప్పుడు నావలనం జనించినసీతను నాయందు

వదలి నీవు నీసమీపమునం దచ్ఛాయ నుంచుకొని రక్షింపుము. మరల బరీక్షాసమయమునందు సీతాదేవిని నీ కొసంగెదను. నన్ను దేవత లంపిరి. నేను విప్రుండను గాను. హుతాశనుఁడను.అని చెప్పఁగా నాతని వచనంబులు విని లక్ష్మణుని కది ప్రకాశింపఁజేయక య దూయమానం బయినహృదయంబుతో స్వచ్ఛందంబు గఁ గైకొనియెను. వహ్ని యుఁ దనయోగబలంబుచేత సీతవలననుండి మాయాసీతం బుట్టించి యాసీతా దేవికి సమానము లగుగుణంబులు ను సర్వాంశంబులు ను గలయా మాయాసీతను రాముని కొసంగెను.ఇట్లొసంగి యావహ్ని "యిది గోప నీయము. దీని నితరులకుఁ దెలియపఱచం గూడ" దనినిషేధించి సీతం దీసికొని పోయెను. ఈగోప్యంబు లక్ష్మణుఁడు నయిత మెఱుంగఁడట్లుండ నితరుల కెట్లెఱుంగనగు. ఆసమయంబున రాముఁడు సువర్ణమృగంబుం గనుంగొనియె. సీత యాకనకమృగంబును బట్టి తెమ్మని ప్రయత్నపూర్వ కంబు గ నాతనిం బంపె. రాముఁడు జానకీరక్షణంబును లక్ష్మణునియందు వదలిపెట్టి వనంబునందు నామృగంబును వెంబడించిచని దానిని సాయ కంబునం జంపె. ఆమాయామృగము లక్ష్మణా! యని కూసి యెదుట శ్రీ హరిం గాంచిస్మరించుచు వైళంబ ప్రాణములు వదలెను.ఆతఁడు మృగ రూపమును బరిత్యజించి దివ్యరూపముఁ దాల్చి రత్ననిర్మితం బయిన విమానమున వైకుంఠమునకుం జనియెను.వైకుంఠమునం బ్రతిద్వారము నందు ను ద్వారపాలకులకుఁ గింకరుం డుండు.అందు జయవిజయులకుం గింకరుండు జితుం డనువాఁడు. మిగులబలవంతుండు. వాఁడు సనకాదుల శాపముచేత రాక్షసతనువుం జెంది యుండి యాతఁడు మరల ద్వారపాల కులకుముంద యాద్వారమునుజేరెను.అంతసీత; లక్ష్మణాయని చెప్పినవిక్ల బంబయినవచనము విని రామునిసన్నిధికి లక్ష్మణునిఁ బంపెను.లక్ష్మణుండు రామునొద్దకుం జనఁ గా దుర్నివారణుం డగురావణుండు చనుదెంచి లీలమెయి సీత నపహరించుకొని లంకకుం జనియె. అచట వనంబున

రాముఁడు లక్ష్మణునిం గాంచి మిగుల దుఃఖించి వేగిరం బ స్వాశ్రమము నకుం జనుదెంచి సీతాదేవిం గానక విషాదమున సుచిరకాలము మూర్ఛఁ జెంది మరల విశేషముగ విలపించెను. ఆగహనమునందు నాసీతను వెద కుచు మరలఁ బరిభ్రమించుచుఁ గొంతకాలమునకు నదీతటమునం బక్షిచే సీతావృత్తాంతం బెఱింగి యావారి వానరుని సహాయముగాఁ గొని సాగరము బంధించి లంకకుం జని యారఘుశ్రేష్ఠుండు సాయకములచే రావణుని సబాంధవముగఁ జంపి దుఃఖిత యగుసీతాదేవిం బడసి సత్వ

## త్రిహాయణిచరితము.

రముగ నామెకు వహ్నిపరీక్ష చేయించెను. ఆకాలమున హుతాశనుండు వాస్తవి యగుజానకి నొసంగె. అప్పుడు ఛాయాసీత వినయాన్విత యయి వహ్నిదేవుని రామునిఁ గాంచి "యే నేమి సేయంగలను. అందు కుపాయము దెల్పుఁడు" అని ప్రార్థింపఁగా వహ్ని యిట్లనియె. ఓదేవి నీవు పుణ్యప్రద మగుపుష్కరక్షేత్రమునకుం జనుము. అచట తపం బొన రించి నీవు స్వర్గలక్ష్మివి గాఁబోయెదవు. అని చెప్పిన వహ్నివచనంబు లాలకించి పుష్కరమునం దపం బాచరించి యాఛాయాసీత మూఁడు లక్షలదివ్యవర్షములకు స్వర్గమున స్వర్గలక్ష్మియయి వెలసెను. ఆయమ కాలక్రమమునం దపము చేసి యజ్ఞకుండమున జనియించి పాండవులకుం గామిని యగుద్రౌపది గా ద్రుపదునికిం బుత్రి యయి వెలసె. కృతయు గమున వేదవతి యనునామముతోఁ గుశధ్వజునికిం గూఁతురయ్యెను. త్రేతాయుగమున రామపత్ని యగుసీతాదేవియనం బరఁగుచు జనకు నికిం దనూజాత యయ్యె. ద్వాపరమున నాయమఛాయ ద్రౌపదీదేవి యనుపేరం బరఁగుచు ద్రుపదునికిం జనియించెను. గాన నీయమ యుగ త్రయమున నుండునది యగుటం జేసి త్రిహాయణి యని చెప్పంబడియె. అని చెప్పిన నారాయణునిం గాంచి నారదుండు నోసందేహభంజనుఁడా మునిపుంగవుఁడా ఆయమకుం బతు లయిదుగు రైరది యెట్లో యీసంశ

యముఁ బాపు మని యడిగిన నారాయణుం డిట్లనియె. ఓనారదా! లంకయందు వాస్తవి యగుసీత రామునిం జెందెను. వహ్నిచే సృజియింపఁబడిన ఛ్ఛాయాసీత రూపయౌవనసంపన్నురా లయియుండునది మహారామపత్నులయాజ్ఞచేఁ దపముఁ గావించి శంకరుని వరము వేఁడెను. ఆయమ కామాతుర యగుటంజేసి పతివ్యగ్ర యయి హేత్రిలోచన పతిం దేహి, పతిందేహి, పతిందేహి, పతిందేహి, పతిందేహి, అని యయిదు మాఱులు మరల మరల ప్రార్థనము గావించెను. శివుండు తత్ప్రార్థనము విని నవ్వుచు నారసికేశ్వరుం డో ప్రియురాలా నీకు భర్త లయిదుగు ఱయ్యెదరు అని వరంబొసంగెను. ఆకారణమున నామె పాండవులకుఁ బ్రియురా లగుపత్ని యయ్యె. ఓనారదా ప్రస్తావము సర్వముఁ జెప్పితిని. ఇఁక మొదటికథఁ జెప్పెద వినుము. అంత రాముండు లంకయందు మనోహారిణి యగుసీతం జెందియాలంకను విభీషణుని కొసంగి మరల నయోధ్యకుం జని భారతవర్షమున నందుఁ బదునొకండువేల యేండ్లు రాజ్యపాలనము సలిపి సర్వజనములఁదోడుకొని వైకుంఠమునకుం బోయెను. కమలాంశ యగునా వేదవతి కమలయందుం ప్రవేశించె. ఓనారదాపుణ్యప్రదంబయినయీయాఖ్యానముఁ జెప్పితిని. దీనివలనఁ బాపములు నశించును. నాలుగువేదములు మూర్తివంతములై యామె జిహ్వాగ్రమున సతతము వర్తించుచుండుం గాన నాయమ వేదవతి యని చెప్పంబడును. కుశధ్వజసుత యగు వేదవతియుపాఖ్యానము సంక్షేపముగఁ దెల్పితిని. ఇంక ధర్మధ్వజునికూఁతునుపాఖ్యానముఁ దెల్పెదను. వినుము.

ఇది బ్రహ్మవైవర్తమహాపురాణమునం బ్రకృతిఖండమునందు నారాయణ
నారదసంవాదమునం జతుర్దశాధ్యాయము
ముగిసెను.

నారాయణమహర్షి యిట్లనియె. ధర్మధ్వజునికిం బత్ని మాధవి యని ప్రసిద్ధిం జెందినయది. ఆసుందరి గంధమాదననగమునందుం బూల వాసనలు చందనవాసనలు వెదజల్లుమారుత మొలయుచుండురమణీయ స్థలమునఁ, బుష్పచందనచర్చితం బయి రతికరం బయి యుండుశయ్యం గావించుకొని తాను సర్వాంగములందుఁ జందనం బలందుకొని యా నారీరత్నమతిమనోహరమగుశరీరమున రత్నంపుసొమ్ములు గైచేసికొని యాకాముకి రసిక లగుకాంతలకుం దలకట్టై యుండునది యగుటంజేసి రసికాసనసంయుత యగుచు రాజుతో సురతసౌఖ్యం బనుభవించెను. రతి చాతుర్యం బెఱింగినవా రగుటంజేసి వారికి రతివిరతి లేక యుండె. అప్పుడు,

ఉ. కామినిముద్దుపల్కు లలకాయజవీరునిసింహనాద మై
భామినిగుబ్బచన్మొనలపంతపుఁబోటులు కామ్రువేటు లై
సామజయానచూపుగమి సారసబాణునిబాణవృష్టి యై
యామనుజేశుఁ గామకలహంబునఁ దాఁకి కరంచెఁ దాలిమిన్.

ఇట్టు లారసికవరులు రేయింబగ ల్గలుంగక నూఱుదివ్యవర్షములు కామసుఖం బనుభవించుచుండిరి. అంత నారాజు మతిం జెంది సురతము వలన విరమించుకొనియె. ఆసుందరి కాముకి యగుటంజేసి యొకించుకఁ

శ్రీతులసీదేవి యవతారము.

దృప్తిం జెందక యుండెను. ఆసతి యది దొట్టి నూఱుదేవవర్షములు గర్భముఁ దాల్చెను. ఆరాజపత్ని శ్రీగర్భ యగుటంజేసి దినదినమునకు శ్రీయుత యగుచు వచ్చెను. ఓపద్మభవునికుమారుఁడా ఆకాంతామణి కార్తికమాసమునం బున్నమనాఁడు శుక్రవారంబున శుభయోగసం యుతం బయినశుభదినమున శుభక్షణమున శుభస్వామిగృహాన్వితంబైన శుభాంశమునఁ బద్మాంశసంభవ యగునారీమణిం గనియె. ఆకన్యక; పద్మ ముల కొప్పయినపాదయుగళమునందుఁ బద్మరాజిచిహ్నములు; గలిగి

రాజరాజేశ్వరీలక్ష్మీరూపిణి యయి; యాయతము లగుసర్వాంగములును రాజలక్ష్మీచిహ్నములును గలిగి; రాజలక్ష్మ్యధిదేవతయై యొప్పుచు; శారదపూర్ణిమాచంద్రునిం బోలుమొగమును, శరత్పంకజములకుం దుల్యము లగులోచనములును, పరిపక్వ మగుబింబఫలమున కొప్పయినయధరమును, ఆరక్తము లగుహస్తపాదతలములును, మనోహర మయి నిమ్న మగునాభియు, తదూర్ధ్వభాగమునం ద్రివళులును, వర్తులము లగునితంబములును, న్యగ్రోధపత్రమునకు సమాన మగునుదరమును గలిగి; శీతకాలసుఖోష్ణము లగుచు గ్రీష్మమునందు సుఖశీతలము లగుచు నొప్పు సర్వాంగములతో నతిరుచిరయు శ్యామయు నయి; శ్వేతచంపకసుమవర్ణము గలిగి; సౌందర్యవతులకంటె సౌందర్యవతి యనందగి; స్మితసుధామధురముగ సూతికాగారమును గాంచుచుండె. ఆకన్యకను జూచి.

(సీ॥ క్షీరనీరధికన్య చెలువకు సాటి యే జడజ యనంగ నాచాన యొప్పు
నాపులోమజ తుల్య యనవచ్చునే నాతి కాసురప్రకృతి యాయజ్ఞనేత్ర
యుమ సరిపోలు నీరమణి కం చనరాదు భిక్షుకకాంత యాభృంగవేణి
రతి యీసతికిం దుల్యరమణి యానా యేమి దగ్ధాత్మనాథ యాతలిరుబోణి
సర్వశుభలక్షణంబుల జగములందు । గొప్పగా నుండువారికే కొఱత లుండ
సాటి యే యన్య లీబోటిగోటికైన । సొగసుకత్తెలు సర్వాంగసుందరికిని.)

అనియివ్విధమున నాడుకొనుచు నచ్చట కేగుదెంచినజను లందఱు ననవద్యశుభలక్షణోపేత యగునాశాతోదరికిం దుల్యగుణరూపవతు లగుమదవతుల నిరూపింపలేక యానాతికిం దులన లేమింజేసి తులసియను నామంబు నెల్లు నని వల్కిరి. ఇది పురావిదులు చేర్కొనినయర్థంబు. అంత శ్యామయు నాయతాంగియు నగు నాతులసి భూమిపయిం బడినయంతట న నవ్వుచు సూతికాగారముం గలయం గనుంగొని లేచి యాసూతికాగారము నిర్గమించి యెల్లవారు నిషేధించినను నిలువక తపము సేయుటకు బదరీవనమునకుం జనియె. ఆయమ యచటం దనకు నారాయణుండు పతి గావలయు నని నిశ్చయించుకొని లక్ష దేవవర్షములు పరమం

బగుతపముఁ గావించె. ఆమె; గ్రీష్మకాలమునం బంచాగ్నిమధ్యమున నుండియు;ప్రావృట్కాలమునం జల్లనిజలముల వసించియు; రేయింబగళ్లు శ్మశానమున నిలువంబడి వర్షధారలకు సహించుచును; తపము గావించెను. ఇరువదివేలసంవత్సరము లాయింతి ఫలములను తోయములను భుజించుచు; ముప్పదివేలయేండ్లాతపస్విని పత్రములు దినుచు;నలువది వేలవత్సరము లాకృశోదరి వాయ్వాహారముఁ గైకొనుచు;నంతఁబదివేల వత్సరములు నిరాహారయై యొకపదమున భూమిపై నిలిచి నిర్వికల్ప సమాధి నుండఁగా నది గాంచి కమలసంభవుండు వరం బొసంగుటకు

తులసికి బ్రహ్మ వరముఁ లొసంగుట.

నుత్తమం బగుబదరికాశ్రమమునకు నేగుదెంచెను. ఆమె చతుర్ముఖునిం గనుంగొని యాహంసవాహనునికి నమస్కరించిన జగములకు సృష్టి కర్తయగునావిధాత యాతులసీదేవి కిట్లనియె. ఓతులసీ హరిభక్తియైన ను ముక్తియైన ను అజరామరత్వం బైన ను నీమనమున నుండు వాంఛితమును వేఁడుము.అని చెప్పినఁ తులసి యు సంతసించుచు ఓతండ్రీ నామనమున నుండు వాంఛితంబు నీకుం దెల్పెదను. నీవు సర్వజ్ఞుండవు. నీయెదుట నిప్పుడు విన్నవించుటకు సిగ్గుపడ నేల?యని చెప్పందొడంగె.

నేను తులసి యనుగోపికను. తొల్లి నేను గోలోకమున నున్నదానను. కృష్ణప్రియురా లగురాధకుం గింకరిని. తదంశసంభూతను. ఆమెకుం బ్రియ యగుసఖియను. నేను గోవిందునితో సంభోగంబొనరించి తృప్తిఁజెందక సుఖమూర్ఛం జెందియుండఁగా రాసేశ్వరి చనుదెంచి రాసమండలముననాతోనుండుగోవిందునిభర్త్సనము చేసినన్నుంగాంచి రుషాన్వితయై యోసీ పాప్మురా! మానవయోనిం జనింపు మని శాపం బిచ్చెను. ఓపితామహా యంతగోవిందుండు నన్నుంగాంచి యోతులసీ నీవుభారతమునందుఁ దపంబొనరించి బ్రహ్మవరముచేత మదంశసంభవుం డగుచతుర్భుజునిం జెందఁగలవు. అని చెప్పి యాదేవదేవుం డయ్యెడ

సంతర్హితుండయ్యెను. అంత నేను నారాధాదేవివలనిభయమునంజేసి తనువుఁ బరిత్యజించి భువియందు జనించితిని. నే నిప్పుడు శాంతుం డను సుందరవిగ్రహుండు నగుచతుర్భుజునిఁ గాంతునిఁ గాఁ బడయంగోరు చున్నదానను. నా కీవరం బొసంగుము. అనిన బ్రహ్మ యి ట్లనియె. ఓతులసీ సుదాముఁ డనుగోపుఁడు శ్రీకృష్ణునియంగమువలనం జనించిన వాఁడు. తదంశసంభవుండు. మహాతేజస్సంపన్నుండు. రాధికాశాపము చేత నిప్పుడు భారతవర్షమునందు దానవవంశమున సంభవించి యున్న వాఁడు. అతఁడు శంఖచూడుం డని ప్రఖ్యాతిఁ జెందియున్నాఁడు. ముల్లోకముల నాతనికి సమానుండు లేఁడు. తొల్లి యాతఁడు గోలోకమున నిన్నుం గాంచి కామోన్మథితమానసుం డై రాధికాదేవిప్రభావము చేత ని న్నతిక్రమింప శక్తుండు గాకయుండె. ఆతఁడు జాతిస్మరుండు గఁ దపముఁ గావించి వరముచేత నిన్నుం బడసియున్న వాఁడు. ఓసుందరీ నీవు జాతిస్మర వగుటంజేసి సర్వము నెఱుంగుదువు. ఇప్పుడు నీ వాదాన వునికింబత్నివి కమ్ము. శోభనం బగు. అనంతరము శాంతుం డైననారా యణునిఁగాంతునిఁ గాఁ బడయఁగలవు. నీవుదైవయోగమున నైననారా యణునిశాపముచేత భవత్కలాంశమున విశ్వము పావనము సేయు వృక్షరూపవై మహాపూతత్వముం జెందెదవు. ఆవృక్షజన్మమున సర్వ పుష్పములకుఁ బ్రధానమ వై విష్ణునికిం బ్రాణములకంటె నధికప్రియు రాలవు గా నుండెదవు. నిన్ను వదలి చేసినసర్వపుష్పములపూజ యు విఫలంబగును. బృందావనమునందు వృక్షరూపి వై బృందావని యను నామమునం బరఁగుచుండుదువు. గోపికలు ను గోపకులును ఆతులసీ వృక్షపత్రములచే మాధవునింబూజింతురు. నావరమునంజేసి నీవు వృక్షాధి దేవతాస్వరూపమున సంతతము గోపకుం డగుకృష్ణునితో స్వచ్ఛందం బుగ విహరింపం జొచ్చెదవు. అని చెప్పిననలువవచనములు విని సంప్రాప్త మానస యయి మందస్మితము సేయుచు బ్రహ్మకుం బ్రణామం బాచ

రించి యాతనితో నించుక మఱి యు నిట్లనియె॥ తులసి॥ ఓతండ్రీ శ్యామ సుందరవిగ్రహుండును ద్విభుజుండు నగు శ్రీకృష్ణునియందు నాకు వాంఛ యెంతఘనం బై యుండునో యట్లు చతుర్భుజునియందుండదు. సత్యము గఁ బల్కెదను. విధివశమున శృంగారమునకు భంగము గలుగుటం జేసి గోవిందునియం దేను పరితృప్తిఁ జెందక యున్నదానను. ఆగోవిందుని వచనమున న చతుర్భుజునిం బ్రార్థించెదను. భవత్ప్రసాదమునం జేసిమరల నిర్విఘ్నము గ గోవిందునిం జెందంగలను. ఇది నిక్కము. రాధాదేవి వలనం గలిగినభయముం బాపుము. అనిన బ్రహ్మ యిట్లనియె. ఓతులసీ నీకుషోడశాక్షరంబయినరాధికామంత్రము నొసంగెదను. గైకొనుము. నావరముచేత నారాధికకు నీవు ప్రాణతుల్యురాల వగుదువు. ఆరాధిక నీవును గోవిందుండును గోప్యముగ శృంగారము ననుభవింప నను మతించును. ఓతులసీ నీవు సుభగురాల వై గోవిందునికి రాధికా సమానురాల వగుభార్యవు కాఁగలవు. అని చెప్పి యాజగత్కర్త షోడ శాక్షరం బయిన రాధికామంత్రమును స్తోత్రమును ఉత్తమమయిన కవచమును సర్వ మయిన పూజావిధానమును పురశ్చర్యావిధిక్రమము నొసఁగి యా తులసికి శుభమగు నట్లాశీర్వచనము లొసఁగి యంత ర్హితుఁడయ్యె. ఆతులసి యు బ్రహ్మోపదేశముచేతఁ బుణ్యమయిన బదరికాశ్రమమునందుఁ బూర్వజన్మమున నిష్టమయియుండుపరమమం త్రమును జపియించుచుఁ బండ్రెండు దివ్యవర్షములు పూజించెను. ఆదేవి సిద్ధురాలు నయ్యె. తత్ప్రత్యాదేశమునందె. తపము ను మంత్రమును సిద్ధింపుడుఁ దనయీప్సితానుగుణము గ వరములు వడసి విశ్వములందు సుదర్లభమయినమహాభోగముల ననుభవించెను. అంతనాదేవి ప్రసన్న హృదయ యయి తపఃక్లమముం బరిత్యజించె. నరులకు ఫలము సిద్ధించె నేని పూర్వమున ననుభవించినదుఃఖము సుఖ మయి తోఁచుంగదా? ఆమెసంతోష మొంది భుజించి పానముచేసి యయ్యెడఁ బుష్పచందన చర్చితమయినమనోహరతల్పమునందుఁ బరుండెను.

ఇది బ్రహ్మవైవర్త మహాపురాణమునఁ బ్రకృతిఖండంబున
నారాయణనారదసంవాదమునందుఁ దులసీవర
ప్రదానంబను పంచదశాధ్యాయము ముగిసెను.

నారాయణమహర్షి యిట్లనియె. తులసియుఁ బరితోష మొందినదై మానసమున సుఖేచ్ఛ బైకొనఁగా నానవయౌవనసంపన్న యగు పరాంగన భర్తృసమాగమమున కువ్విళులూరుచుఁ దనమనమునందు.

ఉ॥ కోరనకోర్కెకిం దగినకూరిమి మీఱఁగఁ గౌఁగిలించుచున్
నీరజపాయకాగమవినిర్మిత సౌరతబంధచాతురీ
చారతతోఁ గరంచునొకచక్కనిసామిని మన్మథోపమున్
జేరి రతిన్ బెనఁగక య చిక్కులు వాయునె నామనంబునన్.

చ॥ కులుకుమిటారిగబ్బిచనుగొండలపోటులఁ గ్రుమ్మి ఱొమ్మునన్
బలుమఱు చెక్కుటద్దముల బాళిసెలంగఁగ ముద్దుగొంచుఁ బు
వ్విలుతునిసంగరక్రియకు వేడుకఁ జొచ్చి కఠోరయౌవనున్
వలఁతిని మన్మథోపముని వల్లభుఁగూడి సుఖించు టెన్నఁడో.

వ॥ అనియిట్లు దలంచుకొనునంతలోన.

సీ॥ పొగరెక్కుపల్కులపుల్గుబాబా నెక్కి గొరవంకలను గండుఁగోయిలలను
గుంపులుచేరిచి కోత్తలసేయుచు బోరనవెడవిల్లు బూన్కి నెత్తి
తళుకులకోరీలతరకసంబులనుండి వాడిమీఱినకోల గూడఁదొడఁగి
టంగుమంచననారి రంగుగా మొరయించి చెవిదాఁక నీడ్చి యచ్చెరువుగాఁగ
కొంచక హుమాయి పైకి దూకించి మించిగుఱిఁగనుంగొని వైళమ కుస్తరించి
చెఱుకుసింగాణిఁబూనువజీరుఁడపుడు గడుసుఁదనమున నేసెవిల్గడుసువడఁగ.

ఉ॥ ఆరహి సేసి పెంజిగురుటాకుఁగటారి జరీనఁ దూసి తాఁ
బేరిమిఁ బైకిఁ దూకి ఝళిపించి చలంబునఁ బేర్చి యార్చి యా
సారససాయకుండు భుజశాలిత దోపఁ గఁ గ్రుచ్చి యెత్తినన్.
బోరన సొమ్మసిల్లి యలపుష్పసుగంధిని పూలపాన్పునన్

ఉ॥ వ్రాలుచుఁ దాళలేక వరవర్ణిని మూర్ఛితయై తనంతటన్
సోలుచు లేవఁ గాంచి యతిశూరత నావెడవింటిపాదుపా
బాలపయిం గడంగి తనబాహుబలంబు సెలంగ నేసునన్
కోలలుసైదు కొక్కటిగ గుప్పి మహోద్భటి నార్చి పేర్చినన్.

ఆమనోహారిణి స్మరదగ్ధయయి చందనమలందుకొని పూలసరములుదాల్చి సర్వాంగములందుఁ బులకలుగ్రమ్ముకొనుచుండ నతివిశాల

ధవళములయి యొప్పు నేత్రములందురక్తకాంతి బర్వఁగంపంబునొందుచు నాకాంతామణి క్షణమున శుష్కీభావంబునొందు. క్షణంబున మూర్ఛఁ జెందు. క్షణంబున నుద్వేగంబు నొందు. క్షణంబున సుఖావహమైన యాలస్యంబుం బొందు.క్షణంబున దాహంబుఁ జెందు.క్షణంబున మహామోహంబుం జెందును. క్షణంబునఁ జైతన్యంబుం బడయు. క్షణంబున విషాదంబు గైకొను.మఱియు నాకాంత తల్పంబునుండి లేచి పోవుచు సమీపస్థలంబున క్షణంబు దిఱుగుచు విభ్రమంబుఁ జెంది యుద్వేగంబువలన మరల పానుపుఁ జేరి నిదురించును. ఆమెకా పుష్పపల్లవతల్పము కంటకంబయ్యె. దివ్యరూపం బగుఫలజలాహారంబును విషం బయ్యె. తానుండుచోటు నిరాకారంబయ్యె. జిలుఁగువలువ యగ్నియయ్యె. సిందూరపత్రంబులు వ్రణంబులవలె దుఃఖప్రదంబు లయ్యె. ఆసుదతి యాలస్యంబుం జెంది యొకక్షణము ప్రమాగన్నువడి యందు సువేషాలంకృతుండును సుందరుండును తరుణుండును రసికేశ్వరుండును చందనపంకంబలందిన సర్వాంగంబులుగలవాఁడును సర్వాభరణభూషితుండునగుపురుషుండు పుష్పమాలికలు దాల్చినవాఁడు సనుదెంచి మందహాససుందరముఖారవిందంబుతోఁ దనముఖాంబుజంబుం గనుంగొనుచుఁ బలుమాఱు ముద్దిడుకొని భోగంబనుభవించి తల్పంబునం గూరుచుండి లేచి మరలఁ బోవుచుండునట్లు కలఁగని యోప్రాణేశా యోకాంతా యెక్కడి కేగెదవు? పోకుముండుముండుమని చెప్పుకొనుచు నిద్రలేచి చైతన్యంబుం జెంది మరలమరల విలాపంబు చేసె. ఓనారదా యిట్లాకామిని యాతపోవనంబున నర్యోడ నుండెను. మహాయోగి యగుశంఖచూడుండు జైగీషవ్యునియుపదేశంబువలన మనోహరం బగుకృష్ణమంత్రంబు వడసి పుష్కరంబున మంత్రసిద్ధిఁ జెంది సర్వమంగళమంగళం బైనకవచమును కంఠంబునఁ గట్టుకొని తనమానసమున నుండునభీష్టములుసిద్ధించునట్లు బ్రహ్మవలన వరములు వడసి యాకమలసంభవుని యాజ్ఞచేతఁ దులసియుండు

బదరికావనమునకుఁ జనుదెంచెను. ఓనారదమునీ! యాశంఖచూడుఁడు రాఁగా నవయౌవనసంపన్నుండును కామదేవునికి సమం బయినప్రభ గలవాఁడును శ్వేతచంపకమునకు సాటి యగువర్ణము గలవాఁడును రత్నభూషణభూషితుండును శారదపార్వణచంద్రునిఁ బోలు మొగము గలవాఁడును శరత్పంకజదళముల కుపమానము లగులోచనములు గలవాఁడును పారిజాతప్రసూనములచే నిర్మితం బయినమాలికను గళంబున దాల్చినవాఁడును కస్తూరియు గుంకుమంబును సుగంధి యగుచందనంబు నలందుకొన్నవాఁడును మణివరనిర్మితం బగువిమానోత్తమంబున నారోహించి యుండువాఁడును మందస్మితముఖారవిందుండు నగు నాపురుషునిం గాంచి యాతండు సమీపంబునకు రాఁగా వస్త్రంబున ముఖం బాచ్ఛాదించుకొని యాతులసి స్మితసుధామధురంబు లగు కటాక్షంబుల నాతనిం బలుమాఱు గాంచుచు నవసమాగమమునకు లజ్జించుచు మోమువంచుకొని యాకాముకి కామబాణపీడిత యై పులకలు గ్రమ్మ నిరంతరము లోచనముల నాతనిముఖాంబుజముఁ గ్రోలుచుండెను. శంఖచూడుండును తపోవనమున నేకాకిని యై పుష్పచందనపల్లవతల్పమున వసించుచు ముఖకమలము నాచ్ఛాదించుకొని చిఱునగవుతోఁ దన్నుఁ జూచుచుండుదానిం గాంచెను. మనోహారిణి యయి సుపీనము లగుకఠినశ్రోణిబింబములు గలిగి పీనములు నున్నతములు నగుపయోధరములతో ముక్తాపఙ్క్తిప్రభలఁ దిరస్కరించుదంతకోరకపఙ్క్తితోఁ బరిపక్వం బయినబింబఫలమున కొప్పయి యొప్పునధరంబుతో సంతప్తకాంచనమునకు దీఁటయినదేహవర్ణప్రభలతో శారదచంద్రునిం బోలుకాంతితో నొప్పుచు నాత్మతేజమునం బరివృత యయి చూడఁ జూడ సుఖముఁ గల్పించుచు మానసముఁ నుహరియించుచు నతిసుందరి యయి యుండుదాని; కస్తూరీబిందువులతో నడుగునఁ జందనబిందువులను దీర్చియుండుసిందూరతిలకమును సీమంతమున కచప్రదేశమున నలంకరించుకొనియున్నదాని; నిమ్నమును సుందరమును గంభీరంబు నయిననాభి

యు, తరంగములకు సమానంబులగు త్రివళులును రక్తారవిందముల కొప్పయినకరతలంబులును, శరదిందుప్రభావినిందకంబులయి యాకారంబున నక్షత్రములకుం దులనవహించునఖంబులును, స్థలపద్మంబులప్రభాజాలంబులంగొల్లలాడుచు నలక్తకరస ప్రభాపటలభంజకంబులయి యారక్తకాంతులతో వెలుంగులలితంబులగుచరణంబులును పద్మరాగరాజి విరాజితంబు లగుపంచోర్ధ్వదేశంబులును, అమూల్యంబులగురత్నంబులచే నిర్మితంబయిన రశనాదామంబులును, ఉత్తమమణిగణఖచితంబు లయినశింజానమంజుమంజీరంబులును, మాలతీమాల్యంబులు ముడిచియుండు గొప్పకబరీభారంబును, అమూల్యరత్నవినిర్మితంబులయి మకరాకారంబులతో వెలుంగుచుండువిచిత్రకుండలములకాంతులు పర్వు గండతలంబులును, కుచకుంభమధ్యస్థలంబున వ్రేలాడుచుండునుత్తమ మణిహారంబులును, రత్నకంకణకేయూరాదిభూషణంబులును, దివ్యరత్నాంగుళీయకరాజితంబు లగునంగుళులును గలిగియుండుదాని; నతిమనోహరాంగరంబులుగలదానిం ; గనుంగొని నతియు సుశీలయు నగు నాసుదతిసరకుం జేరి నవ్వుచు మధురంబుగ నాలలితాంగితో శంఖచూడుం డిట్లనియె.

ఓధన్యురాలా నీవియ్యెడనుండెద వెవ్వనికన్యకవు? నీవుత్తమ కాంతలలో మాననీయవు. ఓమానినీ నీవెవ్వతెవు. ఓకల్యాణీ నీవు సర్వ కల్యాణంబుల నొసంగుదానవు. స్వర్గభోగాదిసారంబు లొసంగునది యయి యనారతవిహారాహారరూప మగుచు మాయాధారంబయి మనోహారంబయి జగద్విలక్షణంబయి క్షేమంబయి మునీంద్రులమానసంబునకు మోహజనకంబయి యుండునీసంసారంబు దారసారంబు. ఓకామినీ యట్లుగాన మౌనంబుమాని యీకింకరునితో సంభాషింపుము. అని చెప్పిన నతనివచనంబులువిని యావామలోచన కామంబుతో చిఱునవ్వునవ్వి మోమువంచుకొని కాముకుండగునా దానవునితో నిట్లనియె.

॥తులసి॥ నేను ధర్మధ్వజుని కూఁతురను. తపస్యసల్పుచుం దపోవనంబునం దపస్విని నై యుం దుండెదను. నన్ను విచారించుటకు నీ వెవ్వఁడవు ? యథాసుఖంబుగఁ జనుము. సత్కులజాతయు పతివ్రతయు నగు కామిని యేకాంతంబున నొంటరి యై యుండఁ గులజాతుండగు వాఁడు దానితోఁ బ్రశ్న చేయఁడు. ఇట్లు శ్రుతియందు నిరూపింపంబడియున్నది. అసత్కులంబున జనించి ధర్మశాస్త్రంబులు వినక శ్రుత్యర్థంబు లాలకింపనివాఁడు స్త్రీలంపటుండగుచు కామియై కామినిని గోరును. పురుషునికిఁ గామిని తొలుత మధురయై గాన్పించు; నంతంబున నంతంబుఁ గల్పించు. విషకుంభంబుపగిది సంతతము ముఖంబున నమృతంబు గలిగియుండు. పలుమఱు మధురవచనంబులు వల్కుచుండునుగాని; హృదయంబునందు ఖడ్గధారకుం దుల్యత్వంబుఁ జెందియుండు. ఎల్లప్పుడును తనకార్యంబు నెరవేర్చుకొనుటయందు తత్పరయైయుండు. స్వకార్యంబునకు గా భర్తకు వశగతయైయుండుంగాని; తనకుఁబని లేని యెడల స్వామికి వశగతయై యుండదు. వదనంబునను చూపులను బ్రసన్నరాలై యుండునంతియ కాని; స్వాంతంబునందు మహామలినత్వంబు నొందియుండు. శ్రుతియందుఁ బురాణమునందు నెవ్వారల చరిత్రము నిరూపింపం బడకయుండు; నట్టి కాంతలను ప్రజ్ఞ లేక దురాశయంబుతో నుండువారల నెవ్వఁడైన విశ్వసించునే? వారలకు మిత్రుం డెవ్వఁడు? శత్రు వెవ్వఁడు? వారలు క్రొత్తక్రొత్తగఁ బురుషుని గోరువారు. చక్కని వేషముతో నుండువానిం గాంచిరేని యెల్లప్పుడును హృదయంబున వానిం గోరుచుండుదురు. వెలికింజూడ తన పతివ్రతాత్వంబుఁ బ్రయత్నపూర్వకంబుగఁ దెలియ పఱచుచుండుదురు. వారలు క్షణక్షణమునకుఁ గామంబు పైపైనతిశయించుచుండువారు. కుటిలస్వభావలు. కామంబునకు నాధారంబై యుండువారు. మనంబును హరియించెడువారు. స్వాంతంబున నెల్లప్పుడును రతిలీలలఁ గోరువారు. అది వెలికిం దోపనీక కపటోపాయంబున దాఁచుచు వర్తించెదరు. వెలికిం జూడ బహులజ్జాన్వితలయి యుండునట్లు

తోఁచుచుండుదురు. రహస్యంబునందుఁ గాంతునిగ్రసించివేయునట్లు పైఁబడికూడుదురు. మానినులు రతిసలుపనిచోఁ గోపగించుకొనుదురు. కలహమాడుదురు. సంభోగంబు విశేషంబుగ రచియించిన భయపడుదురు. ఆసంభోగం బల్పంబగునేని దుఃఖింతురు. వారలకు సుందరుండును రసికుండును కాంతుండును గుణవంతుండును తరుణుండు నగువానియందుండుకాంక్ష మంచిమృష్టాన్నంబునందును శీతంబులగు మధురజలంబులందు నుండదు. రతిచతురుం డగువానియందు సుతునికంటెం బరంబైనస్నేహంబు గలిగియుండుదురు. సంభోగకుశలుఁ డగుప్రియుఁడు వారలకుఁ బ్రాణంబులకంటె నధికుఁ డయినప్రియతముఁడు. వృద్ధుం డైనను, వలరాచపనులకు శక్తిలేనివాఁ డైనను, వానిని శత్రువుగఁ జూతురు. అట్టివారలతోఁ గోపంబునఁ బలుమఱు కలహం బాడుచుండుదురు. ముసలియెద్దును గద్దపొడుచుకొనితినునట్లా ముసలిమగని పొడుచుకొనితిందురు. దుస్సాహసస్వరూపముగలిగి యెల్లప్పుడు సర్వదోషములకు నాశ్రయములై కపటాకారలై దుస్సాధ్యలై వెలికిఁ దోపక యుండుదురు. వారలు బ్రహ్మవిష్ణుశివప్రముఖులకు నపరిత్యాజ్యలై వారికి మోహముఁ గల్పించుచుండుదురు. వారు తపోమార్గమునకు నర్గళములు. ముక్తిద్వారమునకు నెప్పటికిని వీడ గవాటములైనవారు. హరిభక్తికి బహువ్యవహితలు. సర్వమాయలకును కరండములు. సంసారమనియెడికారాగారమునకు లోనుండెడి నిగళములు. ఇంద్రజాలమయులు. మిథ్యారతిగలవారు. బాహ్యాంగములందు సౌందర్యము గలిగి యుందురుగాని యధోంగములు వారికి మహాకుత్సితములు. ఆ యధోంగములు నానావిధము లగువిణ్మూత్రప్రాయములకు నాధారంబులై దుర్గంధమును దోషములును నిండి రక్తాక్తమగు కమలము వలెనుండు. మాయావంతులను మోసము సేయుటకు విధి తొలుత నిర్మించినమాయయే యీస్త్రీలు. ముముక్షువులు వారిని విషంబుగఁ జూతురు. కంటనైనఁ జూడరు. మానసంబుననైనఁ దలంపరు.

అని చెప్పిన విని శంఖచూడుఁడు తులసీవచనములకు నవ్వుచు నుత్తరము సెప్పనుపక్రమించె. ॥ శంఖచూడుఁడు ॥ ఓదేవీ. నీవుచెప్పిన దంతయు నసత్యముగాదు. కొంతభాగముసత్యము. మఱికొంతభాగ మసత్యము. ఇందొకించుకనావలనవినుము. విధాత సర్వమోహనమగు స్త్రీరూపమును కృత్యారూపమనియు వాస్తవమనియు రెండువిధము లుగ నిర్మించెను. ఇందొక్కటి యప్రశంస్యము. ఒక్కటి ప్రశంస్యము. లక్ష్మి, సరస్వతీ, దుర్గా, సావిత్రీ, రాధికాదిక మగు స్త్రీరూపము సృష్టికి సూత్రస్వరూపమై యాద్యంబై యుండు. ఈలక్ష్మ్యాది స్త్రీరూ పము సృష్టికర్తచే నిర్మింపఁబడినది కాదు. వీరలయంశసముద్భవమ యిన స్త్రీరూపము వాస్తవ మనఁబడు. అది ప్రశంస్యము. యశోరూ పము, సర్వమంగళములకుఁగారణము. శతరూప, దేవహూతి, స్వధ, స్వాహా, దక్షిణ, ఛాయాపతి, రోహిణి, వరుణునిపత్ని, శచి, కుబేర పత్ని, వాయుపత్ని, అదితి, దితి, లోపాముద్ర, అనసూయ, కైటభి. తులసి. అహల్య, అరుంధతి, మేన, తార, మందోదరి, దమయంతి, వేదవతి, గంగ, మనస, పుష్టి, తుష్టి, స్మృతి, మేధ, కాళిక, వసుం ధర, షష్ఠి, మంగళచండి, ధర్మునిపత్నియగుమూర్తి, స్వస్తి, శ్రద్ధ, కాంతి, తుష్టి, మఱియొకకాంతి, నిద్ర,తంద్ర, క్షుత్తు, పిపాస, సంధ్య, రాత్రి, దినము, సంపత్తి, వృత్తి, కీర్తి, క్రియ, శోభ, ప్రభమొదలగు స్త్రీరూపము ప్రతియుగముననుద్భూతమగునది. ఉత్తమము. స్వర్గమున వేశ్యారూపమైయుండు స్త్రీరూపము కృత్యారూపమైనయది. అదివిశ్వ ములందప్రశంస్యము. సత్త్వప్రధానమగురూపమేదియో యది స్వభా వమున శుద్ధమయియుండును. అదివిశ్వములందుత్తమంబు. పతివ్రతా స్వరూపము. ప్రశంసింపఁబడినది. అట్టిస్త్రీరూపమును మనీషులు వాస్త వమనియందురు. కృత్యారూపమయియొప్పు స్త్రీస్వరూపము రజోరూ పమనియు తమోరూపమనియు రెండువిధములు; అందురజోరూపము నకు స్థానముదొరకమిచేతను సమయములభింపమివలనను మధ్యవర్తు

లగుదూతికాదులులేమి చేతను దేహక్లేశము చేతనురోగము చేతనుసాధు సంసర్గము చేతను బహుతరమగుగోష్ఠి బలసియుండుట చేతను శత్రుభయమునను రాజభయమునను సాధ్వీత్వములభించునుగాని స్వాభావికపతివ్రతాత్వముండదు. దీనిని మనీషులు మధ్యమరూపమని చెప్పుదురు. అందు దమోరూపమగు స్త్రీరూపమును బుధు లధమ మని చెప్పుదురు. కులజాతుఁడై పండితుఁడగువాఁడు నిర్జనమందైన ననిర్జనమందైన నేకతమునఁ బరకాంతతోఁ బలుకరింపఁడు. నే నిప్పుడు చతుర్ముఖునియానతిచేత నీ యొద్ద కేగుదెంచుచున్నాఁడను. ఓశోభనాంగి గాంధర్వవివాహంబున నిన్నుఁ బరిగ్రహింపఁబోయెదను. విశ్వమున దేవతలకు భయముఁగల్పించువాఁ డగుశంఖచూడుఁడన్ప్రసిద్ధిం గాంచినదానవవంశసముద్భవుఁడను నేన. నేను తొలుత శ్రీహరిపురమున నుండుసుదాముఁడనుగోపకుఁడను. గోగోపీపార్షదులలోఁ బ్రధానులగునష్టగోపకులలో నొక్కరుఁడను. రాధికాదేవిశాపము చేత దానవేంద్రుఁడనై యున్నాఁడను. శ్రీకృష్ణమంత్రప్రభావము చేత నేనుజాతిస్మరుఁడనై యున్నవాఁడఁగాన నంతయు నేనెఱుంగుదును. ఓతులసీ నీవును జాతిస్మరవు. శ్రీహరితోఁదొల్లి నీవు భోగమనుభవించుచుండఁగా రాధ యెఱింగి శపియించుటచే భారతమున భూమియందు జన్మించియున్నదానవు. ఇదినీ వెఱుఁగుదువు. ఆలోకమునందు రాధాదేవివలనిభయము చేత నిన్ను భోగింపనుత్సుకుఁడనయ్యు నట్లుసేయకయుంటి. ఓమహామునీనారదా యిట్లనిచెప్పి శంఖచూడుఁ డూరకయుండెను. తులసియు హర్షమునొంది మందస్మితముసేయుచు నాతనితోనిట్లనియె. ఇట్టిబుధుఁడు విశ్వమునందు బుధులలోఁ బ్రశంసింపఁబడినవాఁడు. కాంతయిట్టికాంతుని నెప్పుడునుగోరుచుండును. నే నిప్పుడు సత్యముగ విచారమున నీచే నపజయమునొందితి. ఏపురుషుఁడు స్త్రీచేత జయింపఁబడునో; వాఁడునిందితుఁడై యశుచియగు. ఆ స్త్రీజితుఁడైనవానిఁ బితరులు దేవతలు బంధుగులు నిందింతురు. స్త్రీజి

తునిఁ దండ్రియు, భ్రాతయు, మానసమున రోయుచు నిందింతురు. విప్రుఁడు జాతమృతములందుఁ బదిదినములకుఁ బరిశుద్ధుఁడగు. భూమీశుఁడు పండ్రెండుదినములకు, వైశ్యుఁడు పదునైదుదినములకును, శూద్రుఁడు నెలకును శుద్ధినొందును. ఇది వేదములందు నిరూపింపఁబడియుండు. మాతృదోషమున వర్ణసాంకర్యమునొందినవాఁడును స్త్రీచేజయింపఁబడినవాఁడును చితయందుదహింపఁబడుకాలమునకుగాని శుద్ధిఁబడయఁడు. ఆతనిపిండతర్పణములను బితరు లిచ్ఛతోఁ గైకొనరు. అతనిపుష్పజలాదికములను సురలు ప్రియమున నంగీకరింపరు. ఎవ్వనిమానసము స్త్రీలచేహరింపఁబడునో; యట్టివానికి జ్ఞానముండియుఁ దపముండియు జపహోమపూజనములుండియు విద్యయుండియు యశంబుండియు నిరుపయోగంబులగు. విద్యాప్రభావంబులం దెలిసికొనుటకై నేను నిన్నుఁ బరీక్షించితిని. కామినికాంతునిబరీక్షించివరునిగాఁ వరియించు. గుణహీనునికైనను వృద్ధునికైనను అజ్ఞానికైనను దరిద్రునికైనను మూర్ఖునికైనను రోగికైనను కుత్సితునికైనను అత్యంతకోపికైనను అత్యంతదుర్ముఖునికైనను పంగువునకైనను అంగహీనునికైనను అంధునికైనను బధిరునికైనను జడునికైనను మూగకైనను క్లీబతుల్యునికైనను పాపిష్ఠునికైనను వరునికిం గన్యనొసంగువాఁడు బ్రహ్మహత్యాపాపమును బడయు. శాంతుఁడై గుణవంతుఁడై తరుణుండై పండితుండై వైష్ణవుఁడైయుండువరునికిఁ గన్యనిచ్చినవాఁడు పదియశ్వమేధయాగములఫలంబు నొందు. ఎవ్వఁడు కన్యకను పెంచి విపత్తుచేతనైనను ధనలోభంబుచేతనైను విక్రయించునో; వాఁడు కుంభీపాకనరకంబునకుంజను. ఆపాపి యానరకంబునందా కన్యకమూత్రపురీషంబుల భుజియించు. మఱియుఁ గ్రిములచేఁ గాకులచేఁ భక్షింపఁబడుచు నింద్రులు పదునల్వురుండుదనుక నయ్యెడనుండి తదంతంబున వ్యాధయోనియందుజన్మించి దివానిశంబు మాంసభారమును మోయుచు నదియమ్ముకొనుచుండును. ఇట్లు వచియించి తులసి యాతపోవనమున

నూరకుండెను. అట్టిసమయంబున బ్రహ్మ వారలసమీపంబునకుఁ జనుదెంచెను. ఓనారదా యాతనింగాంచి తులసియు, శంఖచూడుఁడును నమస్కరింపఁగా వారలతో విరించి వారికిహితంబుగా నిట్లనియె. ॥బ్రహ్మ॥ ఓశంఖచూడుఁడా నీవీతులసితో సంవాదంబుచేయుచున్నావేల? నీవు గాంధర్వవివాహంబున నీమగువను పరిగ్రహింపుము. నీవు పురుషరత్నమవు. ఈసతియు స్త్రీలలోరత్నము. విదగ్ధయగు కాంతకు విదగ్ధునితోసమాగమంబు గుణావహంబగు. ఓరాజా దుర్లభమైననిర్విరోధసుఖంబును ఎవ్వఁడేని విడుచునే? అవిరోధసుఖంబుఁబరిత్యజించినవాఁడు పశువే. ఇందు సంశయంబు లేదు. ఓసతీ తులసీ గుణవంతుఁడును దేవదానవదైత్యవిమర్దనుండును నగునిట్టికాంతునినా! పరీక్షించెగవు! లక్ష్మీవిభునియందులక్ష్మియు,కృష్ణునియందురాధికయు,నాయందుసావిత్రియు, భవునియందుభవానియు,యజ్ఞవరాహునియందుధరణియు,హిమవంతునియందుమేనకయు, అత్రియందనసూయయు, నలునియందుదమయంతియు,చంద్రునియందురోహిణియు,కామునియందురతియు,కశ్యపునియందదితియు,వసిష్ఠునియందరుంధతియు, గౌతమునియందహల్యయు,కర్దమునియందుదేవహూతియు,బృహస్పతియందుఁదారయు,మనువునందుశతరూపయు,యజ్ఞమూర్తియందుదక్షిణయు,హుతాశనునియందుస్వాహయు,మహేంద్రునియందుశచియు, గణేశ్వరునియందుఁబుష్టియు, స్కందునియందుదేవసేనయు,ధర్మునియందుమూర్తియుసౌభాగ్యసుప్రియలైయుండువిధంబున శంఖచూడునియెడల నీవుండుము. ఓసుందరీ సుందరుఁడగునీతనితోఁ జిరకాలంబు యథేచ్ఛంబుగ నెడతెగక ప్రతిరమ్యావనంబులందును విహరింపుము. శంఖచూడుఁడుమృతుండుకాఁగా ననంతరము మరలగోలోకంబున గోవిందునిఁ జెందఁగలవు. వైకుంఠంబునఁ జతుర్భుజుఁడైనశ్రీహరిని జెందఁగలవు. అని యిట్లాశీర్వదించి విధి తననెలవునకుఁ జనియె.

## తులసీశంఖచూడులవిహారము.

అప్పుడు దానవుండగుశంఖచూడుఁడు ఆతులసిని గాంధర్వవివాహమునఁ బరిగ్రహించెను. స్వర్గమున దుందుభివాద్యములు మ్రోగెను. పుష్పవర్షములు వారిపై గురిసెను. అంతనారసికవతంసుండు సర్వజంతువివర్జితమగుబహుమనోజ్ఞదేశమునం దొకనదీతీరమునందుఁ బుష్పచందనతరునిరంతర మగుపుష్పోద్యానమునందుఁ జల్లనిగాడ్పులు వీచుచోటఁ బుష్పచందనచర్చితమయినపుష్పచందనపల్లవతల్పమున కారసికవతంసం డొడ్డొకొనిపోయి; రత్నభూషణభూషితయై పువ్వులదండలు ముడుచుకొని యుండునాసుందరినిఁ బూలపాన్పునకుంజేరిచి యాదేవితో రతిఁగలయ నాయంగన నవసంగమమున నయినసంభోగసుఖసాగరమున మునింగి యాసాధ్వి సుఖమూర్ఛంజెందెను. అంత నతండు సేదదేర్చి రాసంబునందు నామనోహారిణితోఁ గలసి చతుష్షష్టికళామానములుదెలిసి; కామశాస్త్రోక్తమై రసికులకునీప్సితమై యొప్పుచతుష్షష్టివిధసుఖమును గల్పించెను. సురతచాతుర్యమెఱింగినవారలుగాన వారలకు రతివిరతి కలగకయుండె. తులసీసతి లీలమెయి భర్తృమానసంబు హరించెను. రసభావవేది యగునాతఁడును రసికురాలగునయ్యంగనమానసంబును హరించెను. ఆమె నాథునివక్షమునుండి చందనమును, బాహువులసంసక్తమగుతిలకమునుహరింప; నాదయితుఁడు నాప్రియురాలిసిందూరబిందుపత్రంబులు హరియించె. అంత నాతండు ముదమున నాసుందరివక్షమునందు నఖక్షతములుంచిన నామె మిగులఁజెలంగుచు బాహుపాశంబులబంధించి కాంతుని వామపార్శ్వమునఁ గరభూషణములచిహ్నము లేర్పఱిచెను. రాజును మహానురాగమున నారసికేశ్వరిమోవినొక్కి పలుగంటులుంచిన;నాప్రౌఢయుఁ జెలరేగి యాతనిగండయుగంబున నంతకుఁజతుర్గుణముగఁ బలుగంటు లేర్పఱిచెను. ఇట్లు కొంతతడవు రతిసల్పి యాఁయిరువురును పూలపానుపువిడిచిలేచి మానసను

లందుఁ గోరినసువేషాలంకారము లొనరించుకొనిరి. ఆకామిని కాము
కునికిఁ గుంగుమాక్తమగుచందనమునఁ దిలకముదిద్ది రమ్యములగు
సర్వాంగములను చందనమలఁది వహ్నివిశుద్ధము లగునంబరములుగట్టి
సువాసితమగుతాంబూలమిచ్చి సర్వదుఃఖవినాశకర మగుపారిజాత
కుసుమమాలికలనుకొప్పునఁదుఱిమియమూల్యరత్ననిర్మితమయి యుత్త
మమగునంగుళీయకము వ్రేలనిడి మూఁడులోకములందు దుర్లభమయి
యొప్పుసుందరమణిప్రవరముఁ గైచేసి ఓనాథా నీకునేదాసి నని మాటి
మాటికిఁబల్కుచు నాతులసి గుణశాలియగుస్వామికిఁ బరమభక్తిం
బ్రణామములు గావించెను. ఇట్లు నమస్కరించి నాథునిమ్రోలనిలిచి
యతిసుందరుఁడగుకాంతునినిమేషరహితములగుచూపులచే స్మితసుధా
మధురంబుగఁ గనుంగొనుచు నాతనిముఖపంకజమును గ్రోలుచుం
డెను. ఆదానవనాథుఁడును దనప్రాణనాయకిం దిగిచి వక్షమునఁజేర్చికొ
నినఁ జెలియుఁ దన నగుమోమును చేలాంచలమున నాచ్ఛాదించుకొన
నవ్వుచుఁగనుంగొని మరలఁగఠినంబగునామెగండతలమును ముద్దుగొని
చుఱుకుక్కనమోవినొక్కి వరుణునిగెల్చి తాఁదెచ్చినవస్త్రయుగళము
నొసఁగి యగ్నినిఁగెలిచి తెచ్చినస్వాహాదేవిమంజీరయుగళమును పాద
ములనలంకరించి సూర్యునిజయించితెచ్చినఛాయాదేవి కేయూరయుగళ
మును, చంద్రునోడించితెచ్చినరోహిణీదేవికుండలములను, మన్మథునిజ
యించితెచ్చినరతిదేవివరభూషణమగురత్ననిర్మితాంగుళీయకమును గై
చేసి విశ్వకర్మ తనకిచ్చినసురుచిరమగుశంఖమునొసఁగి యింద్రునిగెలిచి
తెచ్చినసుదుర్లభమగుశచీదేవిధరియించుమేఖలాదామమును శ్రోణీతట
మునసిడి మఱియునసేకభూషణములువెట్టి కబరీభారమునందు సుమమా
ల్యములుదుఱిమి కొప్పుచక్కనొత్తి మన్మథునిజయలేఖములకు సమము
లగువిచిత్రపత్రములు గండములను కుచకలశములనువ్రాసి మోమున
సుగంధియగుచందనముచేతఁ జంద్రలేఖాత్రయముచు దానిపై జ్వలించు

చుండుదీపకళికవలెఁ దోఁచునట్లుగ సిందూరతిలకమును దిద్ది యాతిలకమునకుచుట్టునుకుంకుమబిందువులచేఁజిత్రించి స్థలపద్మవినిందకములగు తత్పాదములందు నఖములందునువిచిత్రములగునలక్తకరాగరేఖ లలంకరించి సరాగమగునాచరణాంబుజయుగళమును పలుమాఱు తనవక్షమున నిడికొని మఱియు ననేకావర్తులు "హేదేవితవదాసోహం" అని చెప్పి, రత్ననిర్మితమగువిమానమునం దాతులసితోనెక్కికొని యామనోహారిణినిఁ దనవక్షమున నిడుకొని యారా జాతపోవనమును బరిత్యజించి యఱిగి స్థానాంతరముల విహరించెను. సురలకువిహారయోగ్యములయి వెలయుపర్వతములందు,మలయమనుపర్వతమునందుఁ బ్రతివనములందును మిగులరమణీయములై వెలయుచుండుచోట్ల నన్నిటను నిర్జనములగుపుష్పోద్యానములందునుప్రతికందరములందును,సముద్రతీరమున సుందరములై యొప్పుచుండువనములందును, బహుదినములు విహారము సలిపి పుష్పభద్రానదీతీరమున శీతజలబిందుబృందవాహియైమారుతము వీఁచుచుండుమనోజ్ఞపుళినంబులను, తక్కుఁగలనదీనదంబులను, మధుర మధుకరఝుంకారకులకోలాహలబధిరితదిగంతరమగుచు మధుమాసము సతతమువర్తించుచుండుగంధమాదననగవనములందుఁ,జందనవృక్షములునిండి నిర్ఝములుప్రవహించుచోట్లనుండు దేవోద్యానములందుఁ, చిత్రములగుదేవవనములందుఁ,జందనకాననములందు, చంపక, కేతకీ, మాధవీ, కుంద, మాలతీ, కుముదాం, భోజకాననములందుఁ బ్రతికల్పవృక్షముల యొద్దను,నిర్జనంబై కాంచనమయంబై యొప్పుమేరుపర్వతమునందును, కాంచనాకరమయినకాంచీవనమునందుఁ బుంస్కోకిలకూతంబులచేమనోవినోదంబుఁగల్పించుచోటులఁబుష్పచందనపల్లవతల్పంబులను గల్పించుకొని పుష్పచందనవాయువులోలయఁగాఁ బుష్పములను జందనములఁ దాల్చుకొని కాముకియగునారామామణితో నారసికుఁడగు కాముకుఁడు విహరించెను.ఆదానవేంద్రుఁడు పరితృప్తుఁడుగాక యుండె.

ఆ స్త్రీయాకామినికిని తృప్తి యొకించుకయు లేకయుండె. మఱి వార లకుఁ గ్రమక్రమముగ నాజ్యధారలచే నగ్నివలె మదనుఁడు వృద్ధియగు చువచ్చెను. అంత దానవనాథుఁడు తనప్రియురాలిఁదోడ్కొని తనయా శ్రమమునకువచ్చిచేరి యయ్యెడ రమణీయముగువిహారమందిరము నిర్మిం చుకొని సంతత మాచార్వాంగితో రతిసుఖము లనుభవించుచుండెను. అతఁడు బలపరాక్రమంబుండై దేవతలను, అసురులను, దానవులను, గంధర్వులను,కిన్నరులను, రాక్షసులనుశాసించుచు రాజరాజేశ్వరుండై పరిపూర్ణముగ నొకమన్వంతరము రాజ్యముచేసెను. దేవతలు తమ యధికారములుగోలుపోయి భిక్షుకులవలె సంచరించిరి. శంఖచూడుఁడు బలముమెరసి వారలపూజనములను వారలదేశములను హవిర్భాగము లను ఆశ్రయములను అధికారములను శస్త్రాస్త్రములను భూషణాది కములను తానగైకొనియెను. సురలెల్లవారును చిత్తర్వునవ్రాసినబొమ్మ లపగిదిఁ జేయునదిలేక విషణ్ణులయి బ్రహ్మసభకుంజని వృత్తాంత మా పలువకువిన్నవించి పలువులు శోకసంతప్తులయి యేడువఁగా బ్రహ్మయు వారలందోడుకొని శంకరునియాలయమునకుంజని యాచంద్రశేఖరునికి సర్వవృత్తాంతముఁ దెల్పెను. చతుర్ముఖుఁడును శివుఁడును సురలనుదీసి కొని సుదుర్లభమును జరామృత్యుహరమునై పరమోత్తమధామమై యొప్పుశ్రీవైకుంఠమునకుంబోయిరి. వారలాయుత్తమధామమున శ్రీహరి మందిరములకు వరద్వారమైయొప్పుచుండు ద్వారముసమీపమునకుంజని యయ్యెడఁ బీతాంబరంబులుదాల్చి;రత్న భూషణభూషితులయి;వనమా లాధారులగుచు; శ్యామసుందరవిగ్రహశోభితులయి; చతుర్భుజములఁ జక్రశంఖగదాపద్మములనుధరించి; స్మితసుధామధురములయి పద్మము లఁబోలుయున మొగములు కమలదళములవంటి నేత్రములుగలిగి యతిమ నోహరులయి; రత్న సింహాసనములపై సుఖాసీనులై యుండుద్వారపాల కులను గాంచిరి. అప్పుడు బ్రహ్మ వారలకుతామేగుదెంచినవృత్తాంతము

విన్నవించి వారలయాజ్ఞవడసి సురలందోడ్కొని లోనఁబ్రవేశించి యాకమలోద్భవుఁ డివ్విధమున షోడశద్వారములఁగనుఁగొనుచు వానినతిక్రమించి శ్రీహరిసభఁబ్రవేశించెను. నారాయణస్వరూపములు గలిగి కౌస్తుభమణిభూషితులయి చతుర్భుజములతో నొప్పుచుండు సర్వపార్షదులును దేవర్షులు నిండియుండునదియై; యుత్తమమణివరములచే నిర్మితమగుచు; వజ్రసారశోభలు కలయఁబర్వమనోహరమగుచుఁ; బూర్ణచంద్రమండలసదృశమగునాకారముతో వెలుంగుచుఁ జతురస్రమై; శ్రీహరిచేనమూల్య రత్నఖచితముగ రచితమై; మాణిక్యమాలాజాలములు నిండి ముక్తాపఙ్క్తులలంకరించి మండలాకారములగురత్నదర్పణకోటు లంతటనిలిపి విచిత్రములగుచిత్రరేఖలు వ్రాసి పద్మరాగమణివినిర్మితములగు కృత్రిమపద్మములలంకరించి శ్యమంతకమణివినిర్మితములగుసోపానశతకములమర్పంబడినదై; పట్టసూత్రముల ముడివేసినమనోహరములగుచందనపల్లవములచే నిర్మింపంబడినతోరణములును పారిజాతప్రసూనముల మాలికలును సర్వత్ర బంధించియుండుటచేత సువాసితమై; ఇంద్రనీలమణిస్తంభములును రత్నమయములగుపూర్ణకుంభములు నమర్పంబడి సుసంస్కృతముఁగావించి కస్తూరియు కుంకుమమును గలిసినసుగంధియగుచన్దనద్రవముచల్లియుండుటఁజేసి యాచందనవాయువులచేసువాసితమై; విద్యాధరీసమూహములసంగీతధ్వనులచే మనోహరమై; సహస్రయోజనాయామంబై; యంతటఁ గింకరులు కలసికొనియుండునదియై; యొప్పునాసభామండపమునం బ్రవేశించి యందుంజని బ్రహ్మయు శంకరుఁడును సురలునుఆసభామండపమధ్యమునందు శ్రీహరింగనుంగొనిరి. కిరీటమును కుండలములును దాల్చి వనమాలావిభూషితుండై; చతుర్భుజములచే శంఖచక్రగదాయుధములను, కేళీకమలమును దాల్చినవాఁడై; యమూల్యములగురత్నములచే నిర్మితములగుసర్వభూషణములనుధరించికొని సర్వాంగములఁ జందనములందుకొనినవాఁడై; సరస్వతియు లక్ష్మీ

దేవియు పాదపంకజసంవాహనము సల్ప గంగాదేవి చల్లనిమారుతము లోలయ నధికభక్తివింజామరములువీవ భక్తులందిచ్చుసువాసితమగు తాంబూలముఁ గైకొని విడెముసేయుచు భక్తివినమ్రాత్మకంధరులయి యెల్లవారును సంస్తుతింప వారలనడుమఁ దారకలలోఁ బరిపూర్ణచంద్రు నిపగిదిందోఁచుచు, నుత్తమరత్ననిర్మితంబయిమహాచిత్రమగుసింహాసనమునం గూరుచుండి, విద్యాధరకాంతామణులుసేయునర్తనంబును మందహాససుందరవదనారవిందుఁడై గాంచుచుండువానిని; నవీననీరదంబు భాతి శ్యామసుందరంబై యొప్పుశరీరంబుగలవాని; పరిపూర్ణతముఁడగు విభుని; నతిమనోహరాంగునిం గనుంగొని యాబ్రహ్మాదులగుసర్వసురలు వినయభయసంభ్రమములతో నమ్రకంధరులయి మ్రొక్కి పులకాంకితములగుసర్వాంగములతో నశ్రుకలాకులములగునేత్రములతో గద్గదకంఠులయి స్తుతులుసలుప జగములకు సృష్టికర్తయగుబ్రహ్మ యంజలిపుటము శిరముననిడుకొని వినయముమెరయ శ్రీహరియెదుట వృత్తాంతంబును జెప్పెను. శ్రీహరియు నాతనివచనములాలకించి సర్వజ్ఞుఁడు సర్వభావవేదియు నగునాలక్ష్మీపతి నవ్వి బ్రహ్మతో మనోహర మగునొకరహస్యవృత్తాంతంబును సెప్ప నుపక్రమించెను.

## శంఖచూడునిపూర్వజన్మవృత్తాంతము.

ఓపద్మసంభవుఁడా శంఖచూడునివృత్తాంతమంతయు నెఱుంగుదును. అది మదీయభక్తుం డగుగోపకునిపూర్వవృత్తాంతము. పురాతనమగునితిహాసరూపమై యొప్పుచుండు. అదిగోలోకంబునందుఁ జరిగినది. దానివినినఁ బాపంబులు దొలంగు. పుణ్యంబులు సెలంగు. నాపార్షదప్రవరుం డగుసుదాముఁ డనుగోపాలుఁడు మహాదారుణ మగురాధికాశాపంబున దానవయోనిం జనియించె. ఆగోలోకంబున నొకప్పుడేను నాప్రాణంబులకంటె నధికప్రియురా లగురాధాదేవి మానినియై యుండ నాదేవిం బాసి స్వగృహమునుండి రాసమండలమునకుం బోతిని. రాధా

కింకరీజనంబు నేనువిరజతోవిహరించుచున్న వృత్తాంత మాయతివకుం దెల్పనినుమడించుకోపంబున నాదేవి మాయుండుచోటి కేగుదెంచెను. ఆయమకుభయపడి విరజ నదియయ్యెను. నేనంతర్హితుండనైతిని. అది యెఱింగి యాదేవి రోషముతో సఖులందోడుకొని స్వాలయమునకఱిగెను. అయ్యెడ నేను సుదాముఁడనుగోపకునితో నుండఁగాఁ గాంచి విశేషముగ నిర్భర్త్సనముసలిపెను. అందు కేనేమియుఁ బలులుకక యూరకుంటిని. ఆసుదాముఁడు కోపముఁగొని యారాధను నిర్భర్త్సనము కావించె. నాసమీపముననయట్లునిర్భర్త్సనముఁగావింప రాధయుఁ గనుదమ్ములఁ జేవుఱులుమీఱ నేనుసమీపముననుండుటచే భయంపడుచు నాతని వెలుచుట కాజ్ఞయొసంగ నప్పుడు మహాతేజోవిరాజితులైదుర్వారలయి యొప్పుచుండుసఖులు లక్షసంఖ్యగలవారు లేచిరి. ఇట్లులేచి పలుమఱువదరుచున్న యాసుదాముని నాగృహంబు వెడలనడిచిరి. ఆతని వచనములాలకించి యోరీ పామ్ముదానవయోనింజనింపుము. అని యతి దారుణంబగుశాపమారాధిక యొసఁగిన నాగోపకుఁడు తిట్టుకొనుచు రోదనముసలుపుచు నాకుఁ బ్రణామమాచరించి పోవుచుండెను. ఆదేవి యంతలోఁ గోపముచల్లారి కరుణచే నేడుచుచు విక్లబయగుచునోవత్సా ఉండుము. పోకుము. ఎక్కడకేగెదవు. అనివిలపించుచు నాతని వెంటం జని వారించెను. గోపికలును గోపకులును సుదుఃఖితులయి రోదనము సల్పిరి. అప్పుడు నేను వారలనెల్లర వారించి యోసుదామా నీవిక్కడకు రమ్మనియారాధవచియించెడిపల్కులనడ్డగించితిని. ఓబ్రహ్మా గోలోకము నందు క్షణార్ధమునకు భూలోకముననొకమన్వంతర మగును. ఆసుదా ముఁడే శంఖచూడుఁడై జనించినవాఁడు. మరల నాగోలోకమునకుంజను వాఁడు. వాఁడుమహాబలిష్ఠుఁడు. యోగీశ్వరుఁడు. సర్వమాయావిశార దుఁడు. ఓసురలారా నాశూలంబుంగొని వేగిరంబ భారతమునకుంజనుఁడు. నాశూలముచే నాదానవుని శివుండు సంహరించునది. ఆదానవుఁడు సర్వమంగళమంగళమగు నాకవచమును సతతముకంఠమునధరించుకొని

యుండు. దానంజేసి సంసారమునుజయించు. ఓబ్రహ్మా యదికంఠమున నుండఁగా వానింజయింప నెవ్వనికినిశక్యంబుగాదు. నేనుబ్రాహ్మణరూపముతో నేగుదెంచి యాకవచమును యాచించెదను. ఆతనిపత్నికిఁ బాతివ్రత్యభంగమెప్పుడుగల్గునో యప్పుడయాతనికి మరణముగల్గు ననియాదానవునికినీవువరమొసఁగియున్నవాఁడవు. తత్పత్నీగర్భమునందు నావీర్యమునుంచెదను. నిక్కువము. ఆక్షణముననయాతనికి మృత్యువు సంభవింపఁగలదు. ఆతనిపత్ని యనంతరము తనదేహమునుపరిత్యజించి నాకుంబ్రియురాలగును. అనియిట్లువల్కి జగన్నాథుండు హరునికిశూలమునొసఁగెను. ఇట్లుశూలంబిచ్చి శ్రీహరి యభ్యంతరమందిరమునకుం జనిన బ్రహ్మరుద్రాదులగుసురలునువైకుంఠమునుండికదలి భూలోకమున భారతవర్షమునకుం జనుదెంచిరి.

ఇది శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునఁ బ్రకృతిఖండమునందు నారాయణనారద సంవాదమునఁ దులస్యుపాఖ్యానమునందు శంఖచూడవరప్రసంగ మను షోడశాధ్యాయము ముగిసెను.

---

:శివశంఖచూడులయుద్ధప్రసంగము:

నారాయణమహర్షి యిట్లనియె. ఓ మహామునీనారదా, బ్రహ్మ దానవునిసంహరించుటకు శివుని నియోగించి వేగిరంబ తననెలవునకుం జనిన శివుండును దేవతలయాపదలనివర్తింపంజేయుటకుఁ జంద్రభాగా నదీతీరంబున మనోహరంబయి యొప్పువటవృక్షపుమూలంబునం గూరుచుండి యిష్టుండునుగంధర్వులకునీశ్వరుండునునగుపుష్పదంతుం డను వానివైళంబ శంఖచూడునికడకు దూతగాఁబంపెను. ఆపుష్పదంతుండు నీశ్వరునియాజ్ఞచే నాశంఖచూడునినగరంబునకుంబోయి మహేంద్రనగరమునకంటె నుత్కృష్టంబయి కుబేరభవనంబుకంటెనధికంబగుచు నైదు యోజనములవిస్తారము నందు కినుమడించినదైర్ఘ్యంబునుగలిగి దుర్గమంబులగుసప్తపరిఘలతోసమన్వితంబును జ్వలించుచుండునగ్నికిసమానంబులగురత్నకోటులచేనంతటఁ బ్రజ్వలితంబునయియుండునదియు మణి

వేదికలమర్చియుండువీధీశతకంబుతోసంయుక్తంబగునదియు విచిత్రంబులును సిందూరాకారంబుగలవియు నగుమణివరంబులచే నిర్మింపఁబడి నానావస్తువిరాజితంబులగుచు నలంకృతంబులయిదివ్యంబులయి యొప్పు శతకోటివణిఙ్మందిరంబులచే నిండియుండునదియు నగునాదానవునినగరంబుం గనుంగొని యందుంజొచ్చి తన్మధ్యంబునందుఁ బూర్ణేందుమండలంబుపగిదిమిగులగుండ్రముగాఁగనంబడుచు ; జ్వలించుచుండునగ్నిశిఖలచేనంతటవ్యాప్తంబులయియుండునాలుగు పరిఖలుగలిగి ; శత్రువులకుదుర్గమంబగుచు నితరులకుసుగమంబై; ఆకసంబంటునంతటియధికోచ్ఛ్రాయంబుగలిగినమణిప్రాకారంబులచే వేష్టితంబయి;ద్వారపాలకులతోసమన్వితంబులును,రత్నమయంబులగుకృత్రిమపద్మంబులుదీర్చి నిగనిగలు దేరుచుండునుత్తమరత్నచిత్రపట్టలుప్రాసి రత్నదర్పణంబులు నిండించి యలంకరించియుండునవియునగుద్వారంబులతో సమన్వితంబయి;దివ్యాస్త్రధారులును,మహాబలపరాక్రమసంపన్నులును,సుందరులును, సువేషాలంకృతులును,సర్వభూషణభూషితులునగుశతకోటిదానవులచేనంతటరక్షింపంబడుచుండునదియునగుశంఖచూడునిమందిరంబుం గనుంగొనిప్రధానద్వారంబుఁదరియంజొచ్చియందుఁబింగళాస్యుండును తామ్రవర్ణుండును, భయంకరుండును, నగువాఁడు నవ్వుచు శూలంబు కరంబునధరించి నిలిచియుండుటంగాంచియానియుక్తపురుషునికివృత్తాంతంబుఁదెల్పి యాపురుషునియనుజ్ఞవడసి యాద్వారంబుదాఁటి యట్ల నవద్వారంబులుగడిచి యుద్ధమునకు దూతగానంపంబడినవాని నెవ్వరు నేమియననరని తెలిసికొని యాగంధర్వపతి యభ్యంతరద్వారంబునకు సమీపించి యాద్వారపాలకునితో నీశ్వరుండగుశంఖచూడునికి యుద్ధవృత్తాంతంబువిన్నవింపవచ్చితినని చెప్పిన నాద్వారపాలకుండు రాజసన్నిధానంబునకుంజని యాతనిరాకఁదెల్పి మరలివచ్చి పొమ్మనియాజ్ఞ చేసెను. ఆపుష్పదంతుం డభ్యంతరంబునకుఁజని సభామండపమధ్యంబునందు మణిగణఖచితంబును, రత్నదండసమన్వితంబును, కృత్రిమంబు

లగురత్నపుష్పంబులజాలరులచేనతిప్రశస్తంబును నగుస్వర్ణచ్ఛత్రంబును భృత్యుండుశిరంబునందాల్చుకొనిపట్టుచుండ శ్వేతచామరంబులను, వీవనలనుభృత్యులువీచుచుండ సువేషాలంకృతులగుమూఁడుకోట్లదానవేంద్రులుబలసికొనియుండ శస్త్రిధారులగునితరులునూరుకోట్లమందియిటునటుండిరుగ చూచుటకింపైనవేషముఁదాల్చుకొని రత్నభూషణభూషితుండైమిగులసుందరుండై రత్నసింహాసనంబునఁగూర్చుండి పేరోలగంబుననున్నవానిశంఖచూడునింగనివిస్మయంబునందియాపుష్పదంతుండుసమీపమునకేగిశంకరుండుసెప్పినరణవృత్తాంతంబుఁదెల్పె. ఓరాజేంద్రుఁడా నేను శంకరునిదూతను. ఓప్రభూ నేను పుష్పదంతుండనునామంబుగలవాఁడను. శంకరుండెదివచియించెనో యది నీకుందెల్పెదను. వినుము. ఇప్పుడు దేవతలరాజ్యంబును వారియధికారంబుల నిచ్చివేయుము. దేవతలు సర్వేశ్వరుఁడు నుత్తముఁడు నగుశ్రీహరిని శరణుచొచ్చిరి. ఆహరితన శూలంబునుశివునికొసంగి యాశంకరునింబంపియున్నవాఁడు. చంద్రభాగానదీతీరంబునందు వటవృక్షమూలంబున న్నాత్రిలోచనుం డున్నవాఁడు. వారలవిషయంబైననొసంగుము. యుద్ధంబైననుసేయుము. నిశ్చయించుకొనుము. నేనుమరలఁజనిశంభునితోనెద్దివచింపవలయునో యది నాకుందెల్పుము. అనిచెప్పినదూతునివచనంబులువిని శంఖచూడుఁడు నవ్వి ప్రభాతమున నేనయ్యెడకేగుదెంచెదను. నీవుపొమ్ము. అనిచెప్పిన విని పుష్పదంతుం డచ్చోటువాసి యతివేగమునంజని వటమూలంబుననుండునీశ్వరునికి దానవుఁడుసెప్పిన వచనములను వానిసంపదయును దెలిపెను. ఆసమయమున స్కందుండుశివునికడకుంజనుదెంచెను. వీరభద్రుండును, నందియు, మహాకాలుండును, భద్రుండును, విశాలాక్షుండును, బాణుండును, పింగళాక్షుండును, వికమ్పనుండును, విరూపుండును, వికృంతుండును, మాణిభద్రుండును, భాష్కళుండును, కపిలాక్షుండును, దీర్ఘదంష్ట్రుండును, వికటుండును, తామ్రలోచనుండును, కాలంకటుండును, బలీభద్రుండును, కాలజిహ్వుండును, కుటీచరుండును, బలోన్మ

త్తుండును, రణశ్లాఘియు, దుర్జయుండును, దుర్గముండును, అష్టభైరవులును, రుద్రాంశసంభవులగు నేకాదశరుద్రులును, వసువులును, వాసవప్రముఖులును, ద్వాదశాదిత్యులును, హుతాశనుండును, చంద్రుండును, విశ్వకర్మయు, నశ్వినులును, కుబేరుండును, యముండును, జయంతుండును, నలకూబరుండును, వాయువు, వరుణుండును, బుధుండును, అంగారకుండును, ధర్ముండును, శనియు, నీశానుండును, వీర్యవంతుండయిన కామదేవుండును వచ్చిచేరిరి. ఉగ్రదంష్ట్రియు, ఉగ్రచండయు, కోట్టవియు, కైటభియు, నేగుదెంచిరి. శతభుజములుగలిగిభయంకరియయి వెలుంగుభద్రకాళిస్వయముగ తానునుత్తమరత్నంబులచేనిర్మింపఁబడిన విమానంబున నారోహించి రక్తవస్త్రంబులును రక్తమాల్యంబులును రక్తానులేపనంబులును దాల్చి ముదంబుననవ్వుచు నాడుచు సుస్వరంబుతోఁబాడుచు భక్తులకభయంబును, శత్రువులకు భయంబునొసంగుచు నతిలోలమును వికటమును నయి యోజనాయతంబయి యొప్పునాలుకయుగలిగి వర్తులాకారమయి గంభీరంబయి యోజనాయతంబయి యుండుఖర్పరంబును, గగనంబుందాకుచుండుత్రిశూలంబును, యోజనాయతంబయినశక్తియు, శంఖంబును, చక్రమును, గదయు, పద్మమును, శరంబులును, భయంకరంబయినచాపమును, ముద్గరంబును, ముసలంబును, వజ్రంబును, ఖడ్గమును, ఉల్బణంబయినఫలకంబును, వైష్ణవాస్త్రమును, వారుణాస్త్రంబును, ఆగ్నేయాస్త్రంబును, నాగపాశంబును, నారాయణాస్త్రమును, బ్రహ్మాస్త్రమును, గాంధర్వాస్త్రమును, గారుడాస్త్రమును, పర్జన్యాస్త్రంబును, పాశుపతంబును, జృంభణాస్త్రంబును, పర్వతాస్త్రంబును, మాహేశ్వరాస్త్రంబును, వాయవ్యాస్త్రంబును, దండంబును, సంమోహనాస్త్రంబును, అమోఘంబగు నస్త్రశతకంబును, ఉత్తమంబయినదివ్యాస్త్రశతంబునుధరించి మూఁడుకోట్లయోగినులుగొలువమూఁడుకోట్లసంఖ్యలు గలభయంకరులగుఢాకినులగణంబులతో నేగుదెంచి యయ్యెడనిలువంబడియె. భూతంబులు,

ప్రేతంబులు, పిశాచంబులు, కూశ్మాండులు, బ్రహ్మరాక్షసులు, భేతాళులు,యక్షులు, రాక్షసులు,కిన్నరులును సేవింపఁగా నేగుదెంచి స్కందుండు చన్ద్రశేఖరునికిం బ్రణామంబులుగావించి యాభవునియాజ్ఞచేత సభయందుఁ దండ్రికడం గూరుచుండెను. అయ్యెడఁ బ్రతాపశాలి యగుశంఖచూడుండు పుష్పదంతుండుతనసభాస్థలంబుఁబాసి పోవుడు సభ్యంతరంబునకేగి యావృత్తాంతంబుదెలిపిన నాయుద్ధవార్తవిని తులసి పెదవులుకంఠంబులును తాలువులునెండ విదూయమానహృదయయై యాసాధ్వి మధురము లగువచనంబులఁ బ్రాణనాథునితో నోప్రాణనాథా యోబంధూ నావక్షంబుననొక్కక్షణంబుండుము. ఓప్రాణాధిష్ఠాతృదేవా క్షణమునాప్రాణములరక్షింపుము.జన్మంబునకుసమాధానంబుగ నీమానసంబునంగోరినవియెల్లననుభవింపుము. ఏనుతృప్తింగొని యొకక్షణమొకించుకనిన్నుంగాంచెదను. నాప్రాణంబు లుబ్బటలూగుచున్నవి. నామనంబు నిరతము దగ్ధంబయ్యెడిని. ఈదినమునిశీధినీచరమభాగంబునందు నాకు దుస్స్వప్నంబుగానంబడియె.అనిదుఃఖింపనాతులసివచనంబులాలకించిప్రాజ్ఞుండగునానృపేంద్రుండు భోజనముచేసి పానంబొనరించి సత్యంబునుతత్కాలోచితంబునగునట్లుగనాయమకిట్లనియె. కర్మభోగంబునకునిబంధనంబయినకాలంబున శుభంబును, హర్షంబును, సుఖంబును, దుఃఖంబును,భయమును, శోకమును, మంగళంబు, నమంగళమును,సర్వమునుకాలముననియోజితంబై యున్నయది.వృక్షములు కాలంబున సంభవించుచున్నవి. కాలమున నవి స్కంధవంతములై కాలక్రమమునఁ బువ్వులుబూచి పండ్లుపండుచున్నవి. అవియన్నియు యథాకాలమునఫలించుచుఁగాలమురాఁగా లయంబునొందుచున్నవి. భూతంబులుకాలమునజనించును.కాలంబున లయమునొందును. ఓసుందరీ కాలమునవిశ్వంబులుగలిగెడిని.కాలమునననశియించెడిని.స్రష్టయుఁగాలమునసృజియించు. అవిక్రమముగసంచరించుచున్నవి. బ్రహ్మవిష్ణుశివాదులకునీశ్వరుండయి ప్రకృతికంటెంబరుండయి స్రష్టయుపాలకుఁ

డును సంహర్తయునై యుండునాకృష్ణుని సంతతము భజియింపుము. ఆతండు కాలమున స్వేచ్ఛవలనం బ్రకృతిని నిర్మించి యాప్రభువు విశ్వమునందు ప్రాకృతంబులగు చరాచరంబులన్నింటిని నిర్మించును. బ్రహ్మమొదలు స్తంబపర్యంతము సర్వంబును కృత్రిమంబయి యుండు. నశ్వరములు కాలమునం జనించుచు నశించుచునున్నవి. సత్యుండును, పరబ్రహ్మస్వరూపుండును, త్రిగుణాత్మకంబుకంటెం బరుండు నగురాధికాపతిని; సర్వేశుండును, సర్వరూపుండును, సర్వాత్మకుండు నగువాని భజియింపుము. ఎవండు జలంబునజలంబులసృష్టిచేసి జలంబులజలంబు చేతఁబాలించుచు జలము చేజలములహరించు; నట్టిశ్రీకృష్ణుని సంతతము భజియింపుము. ఎవ్వనియాజ్ఞ చేత వాయువువీచుచు నదియెప్పుడును శీఘ్రగామినియై యుండు. ఎవ్వనియాజ్ఞ చేతఁ దపనుఁడు యథాకాలమునఁ దపించునో? యథాకాలంబునని౦ద్రుండు వర్షించుచున్నవాఁడో! జంతువులందుమృత్యువు ప్రవృత్తంబగుచున్నదో? యథాకాలంబునననగ్ని దహియించెడినో? చంద్రుండును భయంబందినట్లు భ్రమణము సేయుచున్నవాఁడో? మృత్యువునకుమృత్యువై, కాలునికిఁగాలమై, యమునికిఁబరుఁడగుయముండై, స్రష్టకుస్రష్టమై, భవమునందుఁబాలమునికిఁబాలకుండై, విభువయి, సంహర్తకుసంహర్తయై, యుండునాకృష్ణుని శరణు వేడుము. ఓప్రియురాలా యెవరికెవరేబంధువులునుగారు. సర్వబంధువులునాతఁడయగు. ఆతనిభజింపుము. నేనెవ్వఁడనో? నీవెవ్వతెవో? మనమిరువురము తొల్లి విధిచేతఁ గూర్పంబడితిమి. కర్మంబువలన విధి నీతో నన్ను వియుక్తునింజేయుచున్నది. శోకంబునందజ్ఞానియగువాఁడుకాతరుండగు. విపత్తునంబండితుండగువాఁడుదుఃఖింపఁడు. చక్రంబునందు నేమిపగిది సుఖంబునుదుఃఖమునుజుట్టిచుట్టివచ్చుచున్నవి. ఎవ్వనికొఱకు తొల్లి బదరికాశ్రమంబునందుఁదపంబుసల్పితివో; సర్వేశ్వరుండగునా నారాయణునిఁగాంతునిఁగఁబడయంగలవు. అదినిక్కము. నాజేసినతపము

చేత బ్రహ్మవరంబునం జేసి నీవు నాకు లభించితివి. ఓ కామినీ నీవు హరి
కొఱకు తపంబు చేసితివి. హరినిం జెందంబోయెదవు. గోలోకంబునను
బృందావనంబునను జనియించి గోవిందునిం బడసెదవు. నేను నీ దానవశరీరం
బు వాసి యాలోకంబునకుం జని యెదను. అచట నేను సంతతము నిన్నును,
నీవు సంతతము నన్నును గనుంగొనుచుండెదము. మిగుల దుర్లభంబయిన
భారతంబునకు రాధికా శాపంబున నేగుదెంచితిని. మరల నయ్యెడకుఁ
జనుచున్నాఁడ. ప్రియురాలా నాకిందు శోకంబేల. వినుము. ఆకాలంబు
న నీవు నీశరీరంబుం బరిత్యజించి దివ్యరూపంబుఁ దాల్చి హరింబొందె
దవు. ఓ కాంతా కాతరత్వంబు నొందకుము. అని యిట్లు చెప్పి యాదినాం
తంబున నాతులసితోఁ బుష్పచందనచర్చితంబై, యతిశోభనంబై,
మనోహరంబై, యొప్పుచుండు తల్పంబునం బరుండి నిదురించెను. రత్న
ప్రదీపసంయుక్తంబగు రత్నమందిరంబున నానాప్రకారంబులగు విభవం
బులు గావించి యందు సుందరియగు స్త్రీరత్నంబుతోఁ గ్రీడించుచు మంగ
ళమహోత్సవంబుతో రాజు నారాత్రి గడపెను. అతిదుఃఖితయయి రోద
నము సేయుచుండు కాంతను కృశోదరియు నిరాహారయునయి శోకసాగ
రంబున మునింగి యుండు దానిఁ దన వక్షంబునం జేర్చుకొని యాజ్ఞానవేది
దివ్యజ్ఞానంబున మరల నాతులసికి బోధించెను. తొల్లి భాండీరంబు నొద్దఁ
గృష్ణుండొసంగిన యుత్తమజ్ఞానంబును; సర్వశోకంబులు హరించునదియై
వరంబయి యొప్పుదాని నామెకుపదేశించెను. ఆదేవియు జ్ఞానంబు వడసి
వదనేక్షణములు ప్రసన్నములయి యొప్ప మనమున సర్వము నశ్వరంబని
తలంచినదగుటం జేసి హర్షంబునఁ దనదయితునితోఁ గ్రీడించెను. ఓ మునీ
యాదంపతులు క్రీడాపరిశ్రాంతులై సుఖసాగరంబున మునింగి యంగం
బులఁ బులకలు గ్రమ్ముకొన నిర్జనంబున మూర్ఛితులైరి. వారలిరువురు నంగ
ప్రత్యంగసంశ్లేషంబుం గాంచుచు సురతోత్సుకులై ప్రీతి యొసంగ నర్థ
నారీశ్వరుల చందంబున నేకాంగంబుగలవారలుం బోలె దోఁచిరి. తులసి

ప్రాణేశ్వరునిఁదనప్రాణంబులకంటెనధికుండనితలంచె. రాజును తనప్రాణంబులకధీశ్వరురా లగుతులసిని ప్రాణంబులకంటెనధికురా లనితలంచెను.ఒండొరులకుసమానులును మనోహరులునగునాసుందరులు సువేషాలంకృతులగువారు సుఖసంభోగంబువలన నిశ్చేష్టులయి సుఖనిద్రం గాంచి మ్రాగన్ను పడియుండిరి.క్షణంబునకు వారును చైతన్యంబునొంది రసాశ్రయంబై మనోహరంబై దివ్యంబై యొప్పుకథఁ జెప్పుకొనుచు; మరలఁక్షణంబునకునవ్వుచు; నొండొరులొండొరులకుఁ దాంబూలంబులందిచ్చుచు;భుజియించుచుఁ; బ్రీతిమెరయ శ్వేతచామరములుగొని యొండొరులవీఁచుకొనుచు; క్షణముపరమానందంబునఁబరుండుచు; క్షణము సంచరించుచు;క్షణమురసభావవిదులయి కేళీవిశేషంబులుసలుపుచుండిరి. సురతవిషయవిజ్ఞాతలగునారసికులకుసురతంబునవిరతిగన్పడదయ్యె. పైపైన వారలు జయంబుఁ గాంచుచుండిరి. పరాజయం బొకప్పుడును వారలకు లేకయుండెను.

ఇది శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునఁ బ్రకృతిఖండమునందు నారాయణనారద
సంవాదమునందుఁ దులసీశంఖచూడసంభోగంబను
సప్తదశాధ్యాయము ముగిసెను.

---

శివశంఖచూడులసంవాదము.

నారాయణమహర్షి యిట్లనియె. కృష్ణపరాయణుండయిన యారాజు శ్రీకృష్ణునిమానసంబునధ్యానించుచుమనోహరంబయినపుష్పతల్పమునుండి బ్రాహ్మం బయినముహూర్తమున లేచి రాత్రిధరించియుండిన వస్త్రంబులుబరిత్యజించి శుభజలంబులమంగళస్నానంబుగావించి ధౌతవస్త్రంబులుదాల్చి యుజ్జ్వలంబైనతిలకంబుదిద్దికొని యావశ్యకంబయిన యాహ్నికంబుఁదీర్చి యభీష్టదేవతావందనంబాచరించి దధిని, ఆజ్యమును,మధువును,లాజలను,శ్రేష్ఠంబగురత్నంబును,శ్రేష్ఠంబగుమణిని,శ్రేష్ఠం

బహువస్త్రమును, కాంచనంబును, మంగళంబులగు వస్తువులను నిత్యమొ
సంగువిధంబున భక్తితో బ్రాహ్మణులకు దానంబుచేసి యాత్రామంగళహే
తుకంబుగ గురువగు విప్రునికి నమూల్యంబు లగు మాణిక్యములను, ముత్యం
బులను, వజ్రంబులను, రత్నంబుల నొసంగి మంగళార్థంబు దరిద్రుండగు
విప్రునికి గజరత్నంబు నశ్వరత్నంబును మనోహరం బయిన ధేనురత్నంబు
నిచ్చి మోదంబున ద్విజులకు వేయిభాండాగారంబులను, మూఁడులక్షల
నగరంబులను, శతకోటిగ్రామంబులను, దత్తంబులుగావించి సుచంద్రుం
డను పుత్రుని దానవులకు రాజుంగావించి భార్యను రాజ్యంబును సర్వసంపద
లను ప్రజలను అనుచరసమూహంబు లను వాహనాదులను పుత్రునియం
దునిచి యుద్ధసన్నాహంబుతో ధనుష్పాణియై నిలిచెను. ఇట్లు నిలిచి
భృత్యులచేఁ గ్రమంబుగ సైన్యములఁ గూర్చెను. అంత మూఁడులక్షలగుఱ్ఱం
బులతో లక్షయుత్తమగజంబులతోఁ బదివేలరథంబులతో మూఁడుకోట్ల
ధానుష్కులతో మూఁడుకోట్లకవచధారులతో మూఁడుకోట్లశూల
ధారులతో నా దానవేంద్రుండు సేనకుం బరిమితిగావించెను. అందొకయుద్ధ
శాస్త్రవిశారదుని సేనానాయకునిఁగా నియమించెను. వాఁడు మహారథుం
డును యుద్ధంబున రథికులకెల్ల మేటియునగు వాఁడు. నరాధిపుఁడు వానిని
మూఁడులక్షలయక్షౌహిణులకు సేనాపతిం జేసి ముప్పదియక్షౌహిణులు
వాద్యభాండంబులు వాయింప రాజేంద్రుండు మానసంబున శ్రీహరిం దలం
చుకొనుచు శిబిరమునుండి వెలువడెను. అతఁడు రత్నేంద్రంబులచే వినిర్మితం
బగు విమానంబు నెక్కి తాను గురువర్గంబులఁ బురస్కరించుకొని శంకరుని
కడకుం బోవఁ బయనమయ్యెను.

రాజు పంచయోజనవిస్తీర్ణంబగుచు; నంతకు శతగుణం బగు దై
ర్ఘ్యంబుగలిగి; పశ్చిమసముద్రమునకుం దూర్పున మలయపర్వతంబునకుఁ
బశ్చిమంబున శ్రీశైలంబున కుత్తరభాగంబున గంధమాదనంబునకు దక్షి
ణంబున నిరతము జలపూర్ణంబయి ప్రవహించుచు; లవణసముద్రమునకుఁ

ప్రియపత్నియై;సంతతసౌభాగ్యసంయుతయై; శుద్ధస్ఫటికంబుతోసమానమై;భారతంబునసుపుణ్యప్రదంబై;హిమాలయమునుండిశరావతీనదితో మిళితంబై నిర్గమించి గోమంతంబును వామంబుననుంచుకొని పశ్చిమసముద్రంబునం బ్రవేశించుచుండుపుష్పభద్రానదీతీరంబున భారతమునఁబుణ్యక్షేత్రమనఁ బరఁగుచుఁ గపిలమహర్షి తపంబొనరించిన స్థానంబయి సిద్ధిక్షేత్రంబనునామంబుననొప్పుచు సిద్ధులకుసిద్ధాశ్రమంబయి శుభంబయిన యక్షయవటంబుండుచోటికింజని; యావటమూలమునయోగాసనముఁ గల్పించుకొని సమాసీనుండై ముదంబున మోమునం జిఱునగవంకురింపంగోటిసూర్యసమప్రభలుగల్గి యొప్పుచుండువాని; శుద్ధస్ఫటికసంకాశుండై బ్రహ్మతేజంబునజ్వలించుచుండువాని; త్రిశూలమునుపట్టసంబునుధరించియుత్తమంబగువ్యాఘ్రచర్మాంబరంబుఁదాల్చియుండువాని;తప్తకాంచనవర్ణాభంబగుజటాపటలంబును నాగయజ్ఞోపవీతంబులునుమూఁడునేత్రంబులునైదుమొగంబులునుగలిగియుండువాని; మృత్యుంజయుండును మృత్యువునకుమృత్యువు నయివిశ్వంబునకుమృత్యువుంగల్పించునట్టివాఁడునై యొప్పుచుండువాని; భక్తులమృత్యువునుహరించువాని; శాంతుండునుమనోహరుండగువాని;తపంబులకుఫలంబులొసంగువాని; సర్వసంపత్ప్రదుండగువాని;ఆశుతోషుండునుప్రసన్నాస్యుండునుభక్తానుగ్రహకారకుండునగువాని;విశ్వనాథుండును విశ్వరూపుండును విశ్వబీజుండును విశ్వజుండును విశ్వంభరుండును విశ్వవరుండును విశ్వసంహారకారణుండునగువాని;గారణంబులకుఁగారణుండగువాని; నరకార్ణవతారణుండగువాని; జ్ఞానప్రదుండునుజ్ఞానబీజంబునునై జ్ఞానానందమయుండగువాని; సనాతనునిఁ; బార్వతీపతిని; చంద్రశేఖరునింగనుంగొని దానవేశ్వరుండగుశంఖచూడుండు తనతోనుండునందఱితో భక్తియుక్తిమెరయ విమానంబుదిగి శిరంబువంచి యాతనికిఁబ్రణామంబుఁ గావించెను. వామభాగంబుననుండుభద్రకాళికిని తత్పురోభాగంబుననుండుస్కందునికిని

నమస్కరించెను. కాళియు స్కందుండును శంకరుండును దానవేంద్రుని కాశీర్వచనంబులొసంగిరి. ఆదానవనాథునింగాంచి నందీశ్వరప్రభృతులెల్లవారును లేచిరి. అప్పుడయ్యెడ వారందఱు నొండొరులతో మాటలాడుకొనిరి, దానవరాజు వారిఁబలుకరించి శివునిదగ్గఱఁగూరుచుండెను. భగవంతుండగుమహాదేవుండు ప్రసన్నాత్ముండయి దానవునితోనిట్లనియె ॥మహాదేవుఁడు॥ జనుల సృజించినబ్రహ్మ ధర్మవేది. ధర్మునికిజనకుండు. ధార్మికుండును వైష్ణవుండునగుమరీచియనునాతఁ డతనికింగుమారుఁడు. అతనికుమారుఁడు కశ్యపుఁడు. అతఁడుధర్మిష్ఠుండును ప్రజాపతియునై యుండువాఁడు. దక్షుఁడు ప్రీతియు భక్తియు మెరయ కన్యకలను బదుముగ్గుర నాకశ్యపునికొసంగెను. ఆపదుముగ్గురుకన్యకలలో దనువను నామెయొక్కతె. ఆమె సాధ్వియుఁ దత్సౌభాగ్యవర్ధితయునై యుండు. ఆదనువునకు తేజంబునం జ్వలించుచుండుకుమారులు పదునల్వురైరి. వారుదానవులు. వారలలోనొక్కరుండగువిప్రచిత్తియనువాఁడు మహాబలపరాక్రమసంపన్నుఁడు. ఆతనిపుత్రుండుదంభుండనువాఁడు; ధార్మికుండునువిష్ణుభక్తుండును జితేంద్రియుండునగువాఁడు. ఆతండు శుక్రాచార్యునిగురువుఁగావించుకొని పరమాత్మ యగుకృష్ణునిమంత్రంబును లక్షవత్సరంబులు పుష్కరంబునం జపియించె. అప్పుడాతనికుత్తముఁడవును గృష్ణపరాయణుండవునగునీవు కుమారుండవై జనియించితివి. నీవు తొల్లి యెనమండ్రుగోపకులలో నొక్కఁడవు. కృష్ణపార్షదుండవు. ధార్మికుఁడవు. ఇప్పుడు రాధికాశాపంబువలన భారతవర్షంబునందుదానవేశ్వరుఁడవై జనించినాఁడవు. వైష్ణవుండు బ్రహ్మమొదలు స్తంబపర్యంతము భ్రమంబనితలంచు. వైష్ణవులు శ్రీహరిసేవనంబుఁగోరుదురుగాని హరిసాలోక్యసారూప్యసామీప్యసాయుజ్యంబులొసంగినను గైకొనరు. వైష్ణవుఁడు బ్రహ్మత్వమునమరత్వంబును తుచ్ఛంబుగఁ దలంచు. ఇంద్రత్వంబును గుబేరత్వమును లెక్కకైనందీసికొనఁడు. కృష్ణభక్తుండ వగునీకు దేవతలవిషయమునునీ

భ్రమం బేల? దేవతలకు వారి రాజ్యం బొసఁగుము. ఓ రాజా యది నాకుఁ బ్రియము. కానరచియింపుము. నీవు నీ రాజ్యంబునందు సుఖంబుండుము. దేవతలు స్వీయం బగు పదంబునం దుండుదురు గాత. భ్రాతలతో విరోధంబు మ్మానుకొనుము. అందఱును మీఱు కశ్యపునివంశంబునఁ బుట్టినవారు. బ్రహ్మహత్యాదికంబు లగు పాపంబు లెల్ల జ్ఞాతిద్రోహంబునం గలిగిన పాపపుషోడశకలతో నైన సమానంబులుగావు. ఓ రాజేంద్రా నీవు స్వకీయ సంపదలకు హాని సంభవించునని యెంచెదవేమొ? ఎవ్వారికేని యు సర్వ వాసర్వావస్థల యందు సమత్వంబుండునే? బ్రహ్మకు సయితము ప్రాకృతికంబయినలయంబునందుఁ దిరోభావంబును మఱల నాతనికావిర్భావంబును ఈశ్వరేచ్ఛ వలనం గలుగుచున్నది. ఆతనికిం దపమువలన జ్ఞానవృద్ధియు లోకస్మరణంబును గల్గుచున్నది. ఆస్రష్టయు క్రమముగ జ్ఞానముచేత సృష్టిసేయును. ధర్మము సదా సత్యాశ్రయంబగు. అది కృతయుగమునఁ బరిపూర్ణతమమై యుండు. అది మూడు భాగములు త్రేతయందును, రెండు భాగములు ద్వాపరమునందు, నొక భాగము కలియుగమునందును ప్రవర్తించును. అదియా కలి మొదటవర్తిల్లుచుఁ గ్రమంబుగ హ్రాసంబుం జెందు. అమాసనాటి చంద్రకళవలెం గలిశేషంబున నాధర్మము కలామాత్రావశిష్టంబై యుండు. సూర్యునికి గ్రీష్మంబున నెంతతేజంబుండునంత తేజంబు శిశిరంబున నుండదు. దినంబునను మధ్యాహ్నమున నుండు తేజమునకు సమానముగ సాయంప్రాతఃకాలములందు లేదు. ఆసూర్యుఁడు కాలంబున నుదించినవాఁడై క్రమంబుగ బాలత్వంబునొంది యనంతరము ప్రకాండత్వంబుఁ గని మఱల నస్తంగతుఁడయ్యెడిని. దినంబునందు సయితము మేఘచ్ఛన్నంబయినచోఁ బ్రచ్ఛన్నత్వంబునొందు. రాహుగ్రస్తుండై కంపమునొంది మఱలఁ బ్రసన్నుఁడగుచున్నాఁడు. చంద్రుండు పూర్ణిమయం దెంతపరిపూర్ణతముఁడై యున్నవాఁడో చూడుము. నిత్యమట్లుండఁడు. దినదినంబునకుఁ క్షయంబునొందు. కుహూవుగడచిన యనంతరము దినదినమునకు నాతఁడు పుష్టిం జెందును. శుక్లపక్షంబు

నందుసంపద్యుక్తుండై కృష్ణపక్షంబునయక్ష్మచేత వివర్ణత్వంబునొందుచు రాహువుచే గ్రసింపంబడుచు దినంబునందును మేఘమునిబిడంబయి వ్యాపించినప్పుడునుమ్లానత్వంబుం జెందును. ఇంద్రుండునుకొంతకాలము శుద్ధుండయియుండు. కాలభేదంబున సిరిచెడియుండును. అప్పుడు బలి యింద్రుండగును. అతండుభ్రష్టశ్రీకుండైయిప్పుడుసుతలంబుననున్నాఁడు. కొంతకాలము పృథివి సర్వసస్యాఢ్యయయి యావసుంధర సర్వం బునకునాధారంబై యుండు. ఆభూమి కొంతకాలముజలంబునమునింగి విపదభిభూతయయి తిరోభావంబుం జెందు. విశ్వంబులు కాలంబుననశించి యుండు. కాలంబుననుత్పన్నంబులయియుండు. సర్వకాలంబునసముండై యుండువాఁడు పరమాత్ముండగుకృష్ణుండొక్కరుండ. ఓరాజా నేను మృత్యుంజయుండనగుటం జేసి యసంఖ్యంబులగుప్రాకృతలయంబులను పలుమాఱు గాంచితి. ఇకనుగాంచంగలను. అతఁడుప్రకృతిరూపుఁడు. ఆతనినపురుషుండని చెప్పుదురు. ఆతఁడయాత్మ. ఆతఁడజీవుఁడు. ఆతఁడ నానారూపములుదాల్చు. ఆతఁడపరుండు. ఎవ్వఁడెల్లప్పుడునాతనిగుణ కీర్తనంబుసల్పు; నాతఁడుజన్మరోగజరాభయముఁబాసికాలునిమృత్యు వునుజయించు. ఈభవంబునందు నాతఁడు విధినిస్రష్టంగావించె. విష్ణుని రక్షకునింగావించె. నన్ను సంహర్తంగావించె. మేమాతనివిషయంబున నుండునధికారులముగాఁజేయంబడినారము. ఓరాజా నేను నావిషయం బగుసంహారంబునందుఁగాలాగ్నిరుద్రునినియుక్తునింగావించి సంతతము కృష్ణునినామములను, గుణములనుగీర్తనముఁగావించుచుందును. అందుచే నేను మృత్యుంజయుండనై యీజ్ఞానంబుచేత నిర్భయత్వంబుతోనుం డెదను. మృత్యువు నావలనభయంపడివైనతేయునింగన్న సర్పంబుపగిదిఁ బలాయనంబునొందు. ఓనారదా సర్వేశ్వరుండును సర్వజ్ఞుండునుసర్వ భావనుండునునగుశంకరుండుసభామధ్యంబుననిట్లువచియించియూరకుం డెను. రాజావచనంబులువిని పలుమాఱుప్రశంసించుచు నాదేవునితోఁ

గరంబువినయంబుదోఁపమధురవచనంబుల నిట్లనియె॥ శంఖచూడుఁడు॥ ఓప్రభూనీవు సెప్పినదియంతయుసత్యము.అనృతము గాదు. అయినన్ కొంచుకయాథార్థ్యంబును నేను విన్నవించుకొనియెదను. అవధరింపుము. ఇప్పుడియ్యెడ జ్ఞాతిద్రోహముమహాపాపమనినీవువచియించితివి. బలికిం గలసర్వస్వంబు నపహరించి యాతని సుతలంబున కేలపంపిరి. ఆగదాధరుం డునుసుతలంబునుండియుద్ధరింపశక్తుండుగాకయున్నాఁడు.ఓయీశ్వరా ఋద్ధమైనసర్వైశ్వర్యంబును నేను సముద్ధరించితిని. దేవతలు హిరణ్యా క్షునినతనిసహోదరునితో నెట్లుచంపిరి. శుంభాసురప్రముఖులు దేవత లచే నెట్లునిహతులైరి. తొల్లిసముద్రమథనంబునందుసురలుపియ్యూషం బునుభక్షించిరి.అందు మేము క్లేశముమాత్రమనుభవించితిమి.సురలుసర్వ ఫలములువడసిరి. ఈవిశ్వముపరమాత్ముఁడగుకృష్ణునికిఁగ్రీడాభాండము. అతం డెవ్వనికొసంగునో వానికప్పుడుసర్వైశ్వర్యములుగల్గును. దేవదాన వులకుఁ గలహమెుక్కొక కారణమునుబట్టిపలుమాఱునుప్రవృత్తంబగు చున్నయది. కాలక్రమమునవారలకునుమాకునుజయపరాజయములును సంభవించుచున్నవి. అట్టివిరోధముమాకునువారలకునుండఁగా అందు కై నీవేగుదెంచుటనిష్ఫలంబు. నీవునాకుసంబంధివి.బంధువవు. ఈశ్వరుం డవు. మహాత్ముఁడవు. అట్టినీవు మాతోనిప్పుడుస్పర్థసల్పుట నీకు మహా లజ్జాకరము.సమరంబునంబరాజయముగల్గెనేని యంతకంటెనధికంబైన కీర్తిహానియుఁగల్గు.అనియిట్లువల్కినశంఖచూడువచనములువినిత్రిలోచ నుండు నవ్వి యాదానవేశ్వరునికి మధురవచనంబుల యథోచితముగ నిట్లనియె ॥ శ్రీమహాదేవుఁడు॥ ఓరాజా బ్రహ్మవంశసముద్భవులగుమీతో యుద్ధము సేయుటకు మాకుసిగ్గుపడ నేల? పరాజయంబయినచో మహత్త యినయపకీర్తియేలయగు. తొలుతనాహరియెమధుకైటభులతో యుద్ధం బుఁజేసెను. ఓరాజాయాపరమాత్మ హిరణ్యకశిపునితోడను సంగరంబుఁ గావించె.ఆగదాధరునికిహిరణ్యాక్షునితో యుద్ధముసంప్రవృత్తంబయ్యె.

నేనును తొల్లి త్రిపురాసురులతో యుద్ధంబుఁ గావించితిని. సర్వేశ్వరియు సర్వమాతయునగు ప్రకృతికిని పూర్వము శుంభాదిరాక్షసులతో పరమాద్భుతంబయిన యుద్ధము జరిగె. నీవును శ్రీకృష్ణునికిఁ బార్షదప్రవరుండవు. ఇందనుకం జంపంబడిన దైత్యులెవ్వరును నీకు సమానులుగారు. రాజా యిట్లుండ లజ్జయేల? పరాజయము గల్గెనేని యపకీర్తి యేల గల్గు. సురలకు శరణముగా శ్రీహరిచేఁ బంపంబడిన నాకు నవి గల్గునే? ఔరా! ఈవాగ్వ్యయము చేత నేమి యుపయోగము. రాజ్యము దేవతలకొసంగుము. కాదేని నాతో యుద్ధమునకు నైనఁ గడంగుము. ఇది నేను నిశ్చయముగఁ జెప్పెడు వచనము. అని చెప్పి శంకరుండూరకయుండెను. అదివిని శంఖచూడుండును తనమంత్రులతో వేగిరంబయచ్చోటు విడిచి లేచెను.

ఇది బ్రహ్మవైవర్తమహాపురాణంబునందుఁ బ్రకృతిఖండంబున నారాయణనారద సంవాదమునందు దులస్యుపాఖ్యానమున శివశంఖచూడసంవాదం బను సప్తదశాధ్యాయము ముగిసెను.

## మహాకాళీశంఖచూడులయుద్ధము.

నారాయణమహర్షి యిట్లనియె. ఇట్లు లేచి ప్రతాపశాలియగు నాదానవేంద్రుండు శిరము వంచి శివునికిం బ్రణామముఁ గావించి తనమంత్రులతో వేగిరంబ విమానారూఢుఁ డయ్యెను. శివుఁడును వేగిరంబ స్వసైన్యములను సురలను బ్రేరేపించెను. దానవేంద్రుండును స్వకీయసైన్యంబులం బురికొల్పుకొని యుద్ధమునకుం గడంగెను. ఇరువాగులకు యుద్ధంబును ప్రక్రాంతంబగుడు నందు మహేంద్రుండు స్వయము వృషపర్వునితో యుద్ధము చేసెను. భాస్కరుండు సత్వరుండై విప్రచిత్తితోడఁ బోరం దొడంగెను. చంద్రుండు దంభునితోఁ బరంబయిన సంగరంబు సేయం గడంగెను. కాలుఁడు కాలేశ్వరునితోడను, హుతాశనుండు గోకర్ణునితోడను, కుబేరుఁడు కాలకేయునితోడను, విశ్వకర్మ మయునితోడను, మృత్యువు భయం

కరునితోడను, యముఁడుసంహారునితోడను, వరుణుఁడుకలవింకునితో డను, సమీరణుఁడుచంచలునితోడను, బుధుఁడుధృతపృష్ఠునితోడను, శనైశ్చరుఁడురక్తాక్షునితోడను,జయంతుఁడురత్నసారునితోడను,వసు ఫులువర్చసులసమూహంబులతోడను, అశ్వినులుదీప్తిమంతునితోడను, ధర్ముఁడుధనుర్ధరునితోడను,మంగళుఁడుమండూకాక్షునితోడను, ఈశా నుఁడుశోభాకరునితోడను,మన్మథుండుపీఠరునితోడను,ఆదిత్యులుఉల్కా ముఖునితో; ధూమ్రునితో; ఖడ్గునితో;ధ్వజునితో; కాంచీముఖునితో; పిండునితో; ధూమ్రునితో; నందితో; విశ్వునితో; పలాశునితో; దలఁ పడిమహాయుద్ధంబుఁగావించిరి. ఏకాదశరుద్రులేకాదశభయంకరులతో డను, మహామారియుగ్రదండాదులతోడను, నందీశ్వరాదు లందఱును దానవగణంబుతోడను దలపడి సంగరము గావించిరి. ఆఘోరప్రళయము పగిది ప్రాణులకుమహాభయంకరంబై యెసంగె. యోధులునుపిలుతివి యకపోగాడిరి.శంభువు కాళితోడను, సుతుండగుకుమారునితోడనువట మూలంబుననుండెను. సైన్యంబులుగుంపులై యుద్ధముగావించెను. శంఖ చూడుండు రత్నభూషణభూషితుండై గోటిదానవులుగొలువ రత్న సింహాసనంబున నుపవిష్టుండైయుండె. శంకరునియోధులందఱునుయుద్ధ మునంబరాజయంబునొందిరి. సురలెల్లవాసునుక్షతవిగ్రహులయిభయం బందిపలాయితులైరి.అంతస్కందుఁడుకోపముతో దేవతలకభయంబిచ్చి యాత్మీయ తేజంబునఁ దనగణంబులకు బలంబు వృద్ధిపఱిచెను. తానొ క్కఁడ దానవగణంబులతో యుద్ధంబు సేయంబూనుకొని యాతండు సమరమున నూఱక్షౌహిణులదానవసైన్యముల సంహరించెను. అప్పుడు కమలలోచనయగుకాళి తానుఖర్పరంబునొడ్డిమహాక్రోధంబుతో నూఱు ఖర్పరములదానవరక్తంబుఁ బానముచేసెను. మఱియునాను పదిలక్షల గజేంద్రములను,నూరులక్షలఘోటకములను,ఒకహస్తమునంగ్రహించి యవలీలగా మొగంబునంబడవేసికొనియె.ఓమునీ యాయుద్ధంబునందు

నాకసంబున వేయియట్లాడంగడఁగెను. స్కందునిశరజాలంబులచే దానవులు క్షతవిగ్రహులై మహాబలపరాక్రమసంపన్నులగువారందఱును భీతింజెందిపరువిడిరి. వృషపర్వుండును, విప్రచిత్తియు, దంభుండును, వికంకణుండును, వీఱందఱునుక్రమంబుగస్కందునితో యుద్ధంబుగావించిరి. మహామారియు పరాఙ్ముఖురాలుగాక యుద్ధముసలిపెను. స్కందునిశక్తిచే బీడింపంబడి వారందఱును మిగులక్షోభంబుఁజెందిరి. అభయంకరసమరంబునందునక్కడ స్కందునిపయిం బుష్పవర్షంబులుగురిసెను. స్వర్గంబునందు దేవదుందుభివాద్యంబులుమ్రోగెను. ప్రాకృతికం బయినలయంబుచందంబున దానవులకుభయంకరంబై యత్యుల్బణంబును మహాద్భుతంబునైయొప్పుస్కందునిసమరంబుంగాంచి రాజు విమానంబునారోహించి శరవర్షంబుఁగురిపించెను. రాజుగురిపించుబాణవృష్టి మేఘము వర్షించుజలవర్షముభాతిగ్రమ్ముకొనిన ఘోరంబులగుమహాంధకారంబులావరించుకొనియెను. అగ్నులుప్రజ్వలించెను. తక్కంగలసురలును నందీశ్వరప్రభృతులును కాందిశీకులయిరి. కార్తికేయుం డొక్కరుండ సమరమూర్ధంబుననిలిచియుండెను. మఱియు నాదానవుండు దుర్నివార్యంబగునట్లుభయంకరముగఁ బర్వతంబులను, సర్పంబులను, శిలలను, వృక్షంబులను, పలుమాఱు పెనుజల్లులుగాఁగురిపించెను. అట్లుదానవుండు గురియుశరపర్వతవృక్షవర్షంబుచేత సాంద్రంబయిననీరదంబుచేనావరింపంబడినభాస్కరుండునుంబోలెశివనందనుండుప్రచ్ఛన్నుండైయుండె. దానవుండును దుర్వహంబునుభయంకరంబు నగుస్కందునిచేతిధనువునుఖండించి యంతటంబోక దివ్యంబైనరథంబునువిఱుగనేసి రథరథ్యంబులంజంపి దివ్యాస్త్రంబుచేత మయూరంబునుజర్ఝరీభూతంబుఁగావించెను. ఇట్లుగావించి యాస్కందునివక్షంబున సూర్యసమప్రభంబై ఘాతుకంబయి యొప్పుశక్తింబ్రయోగింప నాకార్తికేయుండు క్షణముమూర్ఛవోయి మరలఁజైతన్యంబునొంది తొల్లివిష్ణుండొసంగినదివ్యంబైయొప్పు

వేఱొండుచాపంబెత్తికొని రత్నవరంబులచే నిర్మితంబైయుండువిమానంబు నెక్కి యాకార్తికేయుండు శస్త్రాస్త్రంబులు గైకొని యుద్ధంబత్యుల్బణముగఁగావించెను. అప్పుడాశివునికొడుకు కోపమునదివ్యాస్త్రముఁ బ్రయోగించి దానవుఁడుప్రయోగించినసర్పంబులను, పర్వతంబులను, వృక్షంబులను, శిలలను, అన్నింటినిబోనడంచి ప్రతాపంబు మెఱయఁ బార్జన్యాస్త్రంబు వేసి వహ్నినినిర్వాపణంబుగావించెను. మఱియు నా కార్తికేయుండు లీలమెయి దానవునిరథంబును విఱుగనేసి చాపంబు ఖండించి సారథినినఱికి రథ్యంబులగెడయించి రత్నకిరీటంబునుబడఁద్రోసి దానవేంద్రునివక్షంబుననుల్కాభంబయినశక్తింబ్రయోగింప నారాజును మూర్ఛపోయియప్పుడ దేహముదెలిసి సత్వరుండై మఱియొకయానంబారోహించివైళంబచాపంబుఁగొని యామాయావులకగ్రేసరుండగుదానవుండుమాయచే శరజాలంబులుగురిపించి యాబాణజాలంబులచేసమరంబునగుహునింగప్పి శతసూర్యసమప్రభంబై ప్రళయాగ్నిశిఖాస్వరూపంబుతో వెలంగుచు విష్ణుతేజంబుచేసమావృతంబై యొప్పుచుండునమోఘంబయినయొకశక్తి నెత్తి మహాకోపంబునవైళంబకార్తికేయుని యురంబులక్ష్యంబుగావించి ప్రయోగింప నాశక్తివహ్నిరాశివలెఁబ్రజ్వలించుచు నాతనియంగంబునంబడిన నాశక్తిచేత మహాబలుండగుస్కందుండు మహామూర్ఛఁజెందెను. కాళియాతనిందనక్రోడంబున నెత్తికొని శివునిసన్నిధికింగొనిపోయిన శివుండాతని లీలమెయిజ్ఞానంబున జీవింపంజేసి యనంతంబయినబలంబునొసంగినఁ బ్రతాపవంతుండగునాగుహుండునుమూర్ఛదెలిసిలేచెను. కాళియుసమరంబునకుంజనియె. చంద్రశేఖరుండుకుమారునిరక్షించుచుండెను. ఆనందీశ్వరప్రముఖులగువీరులును, సర్వదేవతలును,సర్వగంధర్వులును,యక్షులును, రాక్షసులును,కిన్నరులును,అనేకవాద్యకర్తలును, నూఱుకోట్లసైన్యంబులును, కాళికాదేవిని వెంబడించి చనియెను. ఆమె సంగ్రామస్థలంబునకుంజనిసింహనాదంబుఁ

గావించిన నాదేవిసింహనాదంబువిని దానవులు మూర్ఛాక్రాంతులైరి. ఆకాళి యమంగళకరంబుగమాటిమాటికిమహాట్టహాసంబుఁగావించుచు హర్షంబుతో మధువుఁద్రాగుచు రణమూర్ధంబున నర్తనంబు సేయందొడంగెను. ఉగ్రదంష్ట్రియు, నుగ్రచండయు, కోట్టవియు, మధుపానంబుగావించిరి. యోగినీసమూహంబును, ఢాకినులగుంపును, సురగణములు మొదలగువారలును సురాపానంబుసలిపిరి. శంఖచూడుండును కాళికాదేవిం గాంచి శీఘ్రగమనంబున యుద్ధభూమి కేగుదెంచెను. దానవులకుభయము గదురఁగా వారల కా దానవేంద్రుం డభయంబొసంగెను. అప్పుడు కాళి ప్రళయశిఖిశిఖాసంకాశంబగువహ్నింబ్రయోగింప దానవరాజు లీలమైఁ బార్జన్యాస్త్రంబు నేసి దానింజల్లార్చెను. కాళియు వారుణాస్త్రంబుం బ్రయోగింప నది మహాద్భుతంబయియతితీవ్రంబగుచుంబయికిరా దానవేంద్రుండు తానించుకేనియుసరకుగొనక గాంధర్వాస్త్రంబునం దఱిగి వేసె. కాళియువహ్నిశిఖోపమంబయినమాహేశ్వరాస్త్రంబు నేయఁగా రాజు వైష్ణవాస్త్రంబున నవలీలగా దానినిఖండించివేసెను. ఆదేవిమంత్రపూర్వకంబుగ నారాయణాస్త్రంబుంబ్రయోగింప రాజామహాస్త్రంబుంగనుంగొని రథంబుడిగి దానికినమస్కరించెను. ఆయస్త్రము ప్రళయాగ్నిజ్వాలలకొప్పయినజ్వాలలుపఱపించుచు నూర్ధ్వంబునంబఱతేర శంఖచూడుండు భక్తిచే దండాకృతిగభూమిపయింబడియె. అంతఁగాళి మహాప్రయత్నంబున మంత్రపూర్వకంబుగబ్రహ్మాస్త్రంబుఁబ్రయోగింపనా మహారాజు బ్రహాస్త్రంబున దానింబరిమార్చె. ఆదేవి మహాకోపమున మంత్రపూర్వకంబుగ దివ్యాస్త్రంబుం బ్రయోగింప రాజును దివ్యాస్త్రజాలంబున దాని రూపుమాపెను. దేవి మహాయత్నంబుతో యోజనాయతంబగుమహాశక్తి నెత్తివేయ రాజుతీక్ష్ణంబు లగునస్త్రజాలంబులచే దానిందుత్తునియలుగావించె. అంత దేవిరోషంబునమంత్రపూర్వకముగఁ బాశుపతంబుఁగయికొనియె. అప్పుడు దానిం బ్రయోగింపంజనదని నిషే

ధించి యశరీరవాణి “యాతనికంఠంబున నెందనుక శ్రీహరికవచంబుండు ; నందనుక మహాత్ముండగు నీనృపునికిఁ బాశుపతంబున మరణంబు గల్గదు. సతి యయిన యీరాజుమహిషికి నెందనుక సతీత్వంబుండు ; నందనుక నీతనికి జరయు మృత్యువును గలుగవని బ్రహ్మ వరంబొసంగియున్నవాఁడు.” అని పల్కెను. ఆవచనంబులు విని భద్రకాళి పాశుపతంబుం బ్రయోగింపక యాసతి క్రోధంబు వెఱిగి లీలమెయి శతలక్ష దానవులం బట్టుకొనియె. ఇట్లు పట్టుకొని భయంకరస్వరూపముతో వేగంబున శంఖచూడుని మ్రింగం బోవ దానవుండు మిగుల వాఁడియగు దివ్యాస్త్రంబున నామెను నివారించెను. ఆదేవియు గ్రీష్మకాలపు సూర్యునితో సమానప్రభగల ఖడ్గంబు విసరివేయ దానవేంద్రుండు దివ్యాస్త్రంబునం దానిని నూరుతునుకలు గావించెను. మరల నామహాదేవి శంఖచూడుని మ్రింగుటకై యతివేగంబునం బరువిడిన నా దానవేశ్వరుండు శ్రీమంతుండును సర్వసిద్ధేశ్వరుండును నగుటంజేసి వృద్ధి జెందెను. ఆకాళియుఁ గోపంబు వెఱిగి మహాభయంకరియగుచు వేగంబున ముష్టితో నాతని రథంబును భగ్నంబు గావించి సారథిని జంపి ప్రళయాగ్నిశిఖాసంకాశంబయిన శూలంబుఁ బ్రయోగింప శంఖచూడుండు లక్ష్యపెట్టక వామహస్తంబునం బట్టుకొనియె. అంత దేవియు మహాకోపంబుఁ దెచ్చుకొని వేగంబునఁ బిడికిట నాతని యురంబునం బొడిచిన దైత్యుండు వ్యథచేత విలవిలబోవుచు క్షణమున మూర్ఛఁ జెందెను. అట్లు క్షణంబుండి యాప్రతాపశాలి చైతన్యంబునొంది లేచెను. ఆతఁడు నాదేవితో బాహుయుద్ధంబు గావింపక యామెకు నమస్కరించెను. ఆదేవియస్త్రంబుఁ బ్రయోగించిన దానిఁ దన తేజంబునం బట్టుకొనెం గాని; యాతండు వైష్ణవుండగుటం జేసి మాతృబుద్ధితో భక్తి సేయుచు నస్త్రంబా దేవిపైఁ బ్రయోగింపఁడయ్యె. ఆదేవి కోపంబున దానవునిం బట్టుకొని పలుమాఱు త్రిప్పి మహావేగమున నూర్ధ్వంబునకు విసరివైచినఁ బ్రతాపవంతుండగు నా శంఖచూడుఁడు వేగంబునం బైనుండి పడియె. అట్లుపడి యాతఁడు భద్రకాళికిం బ్రణా

మంబుగావించి లేచినిలిచెను. మఱియు నాదానవేంద్రుండు రత్నవరంబులచేనిర్మితంబయి మనోహరంబయినమఱియొకవిమానంబు నెక్కి మహాహర్షంబుతో నామహాసంగరంబునందు శ్రాంతుఁడుగానట్లు కనంబడియె. ఆభద్రకాళిక్షుధచేత దానవులరక్తంబునుద్రాగి మాంసంబును మిక్కుటముగభుజియించి శంకరునికడకుంజనియె. ఆకాళి రణవృత్తాంతంబును పౌర్వాపర్యక్రమంబుననంతయువినిపింప శంభువు దానవులవినాశంబువినినవ్వెను. ఆకాళి యాతనితో నిప్పుడుయుద్ధంబునందు దానవేంద్రుండగుశంఖచూడునితో బలోద్రిక్తులగులక్షదానవేంద్రులు మిగిలియున్నారు. ఓయీశ్వరా మహోద్వృత్తంబయినదానవబలంబును తక్కినదానినంతయు నేభక్షించితిని. సంగ్రామంబునం బాశుపతంబుచేత రాజగుదానవేంద్రుండవధ్యుండనియు వీనింజంపనాకుశక్యంబుగాదనియునశరీరవాణివల్కినయది. ఆరాజేంద్రుండు మహాబలపరాక్రమసంపన్నుఁడు. మహాజ్ఞానియగువాఁడు. అతఁడునాపైనస్త్రంబుఁబ్రయోగించినవాఁడుగాఁడు. నాప్రయోగించినసాయకంబులమాత్రముఖండించెను.

ఇది శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునఁ బ్రకృతిఖండమునందు నారాయణనారద
సంవాదమునందుఁ దులస్యుపాఖ్యానంబున కాళీశంఖచూడయుద్ధంబను
నేకోనవింశాధ్యాయము ముగిసెను.

---

### శివుండు శంఖచూడుని సంహరించుట.

నారాయణమహర్షి యిట్లనియె. ఓనారదా తత్త్వజ్ఞానవిశారదుండైనశివుండుయథార్థవృత్తాంతంబెఱింగిస్వగణంబులతో స్వయము సమరమునకుంజనియెను. శంఖచూడుండు శివునింగనుగొని విమానమువలన నుండిదిగి భూమియందుదండాకారంబుగఁబడి యుత్తమంబైనభక్తితో నమస్కరించెను. ఇట్లుప్రణామంబాచరించి యాతఁ డతిత్వరితగతివిమానారూఢుండై యుద్ధసన్నాహంబుఁగావించి తూర్ణంబుగ దుర్వాహంబైన

ధనువుంగయికొనియె. ఆశివదానవులకు నొకవత్సరముపూర్ణంబగునంత దనుకయుద్ధంబుజరిగెను. ఓబ్రహ్మర్షీ వారలకిరువురకు జయపరాజయంబులు లేకయుండె. అంతభవుండగుశివుఁడు న్యస్తశస్త్రుండయ్యె. దానవుండు నున్యస్తశస్త్రుండయ్యె. శంఖచూడుఁడురథంబుపైనను వృషధ్వజుఁడువృషభంబుపైననుండిరి. నూర్గురుదానవులుమిగిలియుండిరి. ఆరణంబున నెవ్వ రెవ్వరుమరణమునొందిరో; వారలనందఱను విభువగుశంభుండుబ్రతికించెను. అంతమహామాయావియగువిష్ణువు వృద్ధబ్రాహ్మణరూపంబుఁదాల్చిన వాఁడయి యాయుద్ధరంగంబున కేగుదెంచి దానవేశ్వరునితో నిట్లనియె.

॥ వృద్ధబ్రాహ్మణుఁడు ॥ ఓరాజేంద్రా విప్రుండనగునాకు సాంప్రతము భిక్షయొసంగుము. నీవుసర్వసంపదలొసంగువాఁడవు. నీకంటెదాతలులేరు. నామనంబుననుండువాంఛితంబును పూర్ణంబుగావింపుము. నేనువృద్ధుండను. ఆహారములేకదప్పిఁగొని యాతురుండనై యున్నాఁడను. నావాంఛితంబనంతరముచెప్పెదను. తొలుతనావాంఛితంబిచ్చెదనని సత్యప్రతిజ్ఞ సేయుము. అనియిట్లావిప్రుండడిగిన రాజేంద్రుండు ప్రసన్నంబగువదనంబునుకన్నులుగలవాఁడై ఓం, అనియంగీకరించెను. అంతనాహరిమాయచే నోదానవేంద్రా నేనునీకంఠంబుననుండుకవచంబుకొఱకు నిన్నిట్లుయాచించితిని అనిచెప్పెను. అదివినిదానవేంద్రుండు త్తమంబయినకవచంబు నాబ్రాహ్మణునికిచ్చెను. హరియుదివ్యంబగునాకవచంబుఁ గయికొని చని యావృద్ధబ్రాహ్మణస్వరూపంబుజ్జగించిశంఖచూడునియాకారముఁదాల్చి తులసీదేవికడకుంజని కపటోపాయంబున నామెయందు వీర్యాధానంబొనరించెను. అంత శంభువుదానవునిపై వ్రేయుటకు హరిశూలంబుంగైకొనియె. ఓనారదా గ్రీష్మకాలమధ్యాహ్నమార్తాండశతసమానంబులగు ప్రభలతోఁబ్రజ్వలించుచుండుదానిని, అగ్రంబుననారాయణునిచే. మధ్యంబునబ్రహ్మచే, మూలమునశివునిచే, ధారయందుఁగాలునిచే నధిష్ఠింపంబడియుండుదానిని, ప్రళయాగ్నిశిఖాకలాపసమానంబులగుకిరణజాలం

బులుగలిగియుండుదానిని, దుర్నివార్యంబును దుర్ధర్షంబును అమోఘంబును వైరిసంహారకంబునగుదానిని, తేజంబునఁజక్రంబుతో సమానంబయి సర్వశస్త్రాస్త్రసారంబయి శివకేశవులకం టెనితరులకు దుర్వహంబయి భయంకరంబై యుండుదానిని, ధనుస్సహస్రపరిమితంబగు దైర్ఘ్యంబును శతహస్తపరిమితం బగువైశాల్యంబునుగలదానిని, బీజసంకలితంబయి బ్రహ్మరూపంబై నిత్యంబయి యనిర్మితంబయి యుండుదానిని, అవలీలగా సమస్తబ్రహ్మాండంబుసంహరింపఁజాలినదానిని, ఆమహాశూలమునుద్రిప్పి శంఖచూడునిపైఁబ్రయోగించెను. రాజును చాపంబునుబరిత్యజించి భక్తితో శ్రీకృష్ణచరణాంభోజంబులు మానసంబునఁదలంచుచు యోగాసనంబుననుండి ధ్యానంబుసేయఁ బూనుకొనియె. శివుండు ప్రయోగించిన శూలంబుభ్రమణముఁగావించుచు నాదానవేంద్రునిపయింబడె. ఇట్లుపడి యాశూలము శంఖచూడుని నాతనిరథంబును క్షణంబున భస్మంబు గావించె. రాజును దానవశరీరంబుఁద్యజించి గోపకిశోరవేషంబుగలదివ్యరూపంబుఁదాల్చి; ద్విభుజుండునుమురళీహస్తుండునురత్నభూషణభూషితుండునగుచు; నుత్తమరత్నములచేనిర్మితంబైగోపకకోటిపరివేష్టితంబై గోలోకమునుండివచ్చియుండువిమానంబునారోహించి; యాపురమున కుంజనియె. ఇట్లుసనియాతఁడు బృందావనంబునరాసంబునందు రాధామాధవులచరణాంబుజంబులకునమస్కరించిననారాధాకృష్ణులునాసుదామునింగనుంగొని ప్రసన్నవదనేక్షణులై ప్రేమంబున మానసంబునందు ద్రవించుచుస్నేహంబువెరిగి కౌఁగిళ్లంజేర్చుకొనిరి. అంతనాశూలంబును శూలికరంబుంజేరెను. ఆశంకరుఁడాశూలంబుచేతనశూలపాణియయ్యె. ఆశివుండుప్రేమంబున నాశూలంబుచేత నాశంఖచూడదానవుని యస్థిసమూహంబును లవణసముద్రంబునంబడునట్లు పారఁజిమ్మెను. ఆశంఖచూడునియస్థులచేతన సముద్రంబున శంఖజాతిసంభవించె.

శంఖంబునకుం గలమాహాత్మ్యము:

ఆశంఖజాతి యనేకప్రకారంబులనుండు. సురార్చనంబునందు మిగులఁబరిపూతమైనయది. శంఖతోయము మిగులప్రశస్తము. దేవతలకు మిగులఁబ్రీతిఁగలిగించునది. ఆశంఖోదకము గంగాదితీర్థరూపము. మహాపవిత్రము. శంభునకట్లుగాదు. ఎయ్యెడశంఖశబ్దంబుగల్గు; నయ్యెడలక్ష్మి సుస్థిరయయియుండును. ఎవ్వండు శంఖోదకంబులచేత స్నాతుండగు; వాఁడుసర్వతీర్థస్నానంబొనరించినవాఁడు. శంఖంబునహరియధిష్ఠించియుండు. శంఖంబున్నచోటహరియుండు. ఆచోటలక్ష్మియునుండు. అమంగళంబుదూరీభూతంబగు. స్త్రీలుచేసినశంఖధ్వనులచేత లక్ష్మి భయంబంది రోషించుకొని యాస్థలంబువాసి స్థలాంతరంబునకుఁజనును. శూద్రులు చేసినశంఖధ్వనులకు మిగులరోసగించుకొనిలక్ష్మియయ్యెడబాసిపోవును. శివుండును దానవునింజంపి శివలోకంబునకుంబోయెను. సురలును పరమానందసంయుతులయి స్వవిషయంబులంబడసి సుఖించిరి. స్వర్గంబున దేవదుందుభులుమ్రోగెను. గంధర్వులును కిన్నరులునుగానంబుచేసిరి. శివునిపైనిబిడతరంబుగఁబుష్పవృష్టికురిసెను. ఆశివునినందఱుసురలును మహర్షివర్యులును ప్రశంసించిరి.

ఇది బ్రహ్మవైవర్తమహాపురాణంబునందుఁ బ్రకృతిఖండంబునందు నారాయణనారద సంవాదమునందు తులస్యుపాఖ్యానంబున శంఖచూడవధంబను వింశాధ్యాయము ముగిసెను.

నారదుండిట్లనియె. భగవంతుండగునారాయణుఁడు తులసియందు వీర్యాధానంబుచేసె నని చెప్పితివి. అదియెట్లుకావించెనో నాకు దెల్పుము. అనినారదుండడిగిన నారాయణమహర్షి యిట్లనియె.

## నారాయణుండు తులసీదేవికిఁ బాతివ్రత్యభంగంబుఁ గావించుట.

ఓనారదా వినుము. భగవంతుండగు నారాయణుండు దేవతల కార్యంబు సాధించుటకు శంఖచూడరూపధారియై యాతనిపత్నితోఁ రమించెను. అది యెట్లనిన? ఆవిష్ణుండు కపటంబున శంఖచూడుని కవచంబు గ్రహించుకొని యంతనా శంఖచూడుని యాకారంబుఁ దాల్చి తులసీదేవి గృహంబునకుం జని యాద్వారంబునకు సమీపంబున దుందుభివాద్యంబు మ్రోయించి చారునిమూలకంబుగ నాసుందరీమణికి జయశబ్దంబెఱింగించెను. సాధ్వి యగు నాతులసి యాశబ్దంబు విని పరమానందభరితమానసయై పరమాదరంబుతోఁ జాలమార్గంబునొద్దకుం జని యాగవాక్షమార్గంబున రాజమార్గమునను౦డు శ్రీకాంతునిం గాంచి యానందభరితాంతరంగయై బ్రాహ్మణుల కపరిమితధనంబులొసంగి మంగళకృత్యంబులు గావించెను. వందిజనంబులకు భిక్షుకులకు వాచకులకును ధనంబొసంగెను. దేవుండగు నారాయణుండు తూర్ణంబుగ రథంబునుండిడిగి యమూల్యరత్ననిర్మితంబయి సుందరంబై మనోహరంబై యొప్పు తులసీదేవియుండు భవనంబునకుం జని యాదేవిం గాంచి తనమనంబున,

సీ॥ కమలాక్షి యీయింతిగతిసౌకుమార్యంబుఁ గనుఁగొనఁ నంచలు గర్వముడుఁగు
భామపల్కులు విన్నఁ బరభృతగణమెల్ల వాచంయమత్వసువ్రతముఁ బూను
సతివయంగంబులయకతోరతఁ గనంగఁ జత్రాయి యనవచ్చు సన్నజాజిఁ
జెలికాంతిఁ గన్గొన్నఁ గలుములజవరాలు కాషాయము ధరించుఁ గడువిరక్తిఁ
గోర్కెనీసంహతస్తనిఁ గూడునంత । దనుకఁ గమలజుకల్పమై దనము వెరిగ
జాముకల్పాతిదీర్ఘమైజరిగె మఱియు । క్షణముయుగమయ్యెఁ దాళఁగాశక్యమగునే.

అనియనుకొనుచుండఁ దులసియు నెదురేగుదెంచి యెదుట కాంతుండైన కాంతునిం గనుంగొని మోదంబువెరిగి యాతనిచరణంబులు గడిగి నమస్కరించి రోదనంబు చేసెను. మఱియు నాకాముకి రమణీయంబైన రత్నసింహాసనంబున నాతనిసుఖాసీనునిం గావించి కర్పూరాది

సువాసితంబగు తాంబూలమిచ్చినా ప్రాణేశ్వరుండు యుద్ధమునుండి మరలి యింటికి రాఁ గంటిని. ఇప్పుడు నాజన్మంబు సఫలంబయ్యె. నేఁజేసినక్రియలన్నియు నిప్పుడు ఫలంబొసంగినయవి. అనియనుకొనుచు నాసుందరి మందస్మితసుందరముఖారవిందయై క్రేఁగంటిచూపులం గనుంగొనుచుఁ గామంబతిశయింప మెయినిండఁ బులకలుగ్రమ్మ మధురవచనంబులం గాంతుని రణవృత్తాంతంబడిగెను. ॥తులసి॥ ఓప్రభూ శివుండసంఖ్యంబులగు బ్రహ్మాండంబుల క్షణంబున సంహరించెడువాఁడు. ఆతనితో యుద్ధము సేయంగడంగిననీకు జయంబెట్లు కలిగెను? ఓకృపానిధీ యిదినాకుం జెప్పుము. అనియడిగినతులసీవచనంబులు విని కమలాపతి నవ్వి శంఖచూడుని వేషముననామెతో నమ్రతవచనంబులాడెను. ॥శ్రీహరి॥ ఓకాంతా మాయిరువురకును ఒకవత్సరంబంతయు సంగరంబు జరిగెను. ఓకామినీ యందు దానవులెల్లవారును వినాశంబుం జెందిరి. బ్రహ్మ తానెయేగుదెంచి మాయిరువురకును సఖ్యంబుఁ గావించె. ఆబ్రహ్మ చేసినయాజ్ఞచేత దేవతలయధికారంబు నేను వారలకొసంగితిని. నేను నాయింటికేగుదెంచితిని. శివుఁడు శివలోకమునకుం బోయె. ఓనారదా యాజగన్నాథుండిట్లు తులసికిం జెప్పి పాన్పునం బరుండి యాతులసినందుకుం దిగిచికొని రాగమున నా శంఖచూడుని పత్నితో రమించెను. ఆసాధ్వి యుఁదనభర్తృరతిసుఖముకంటె నతిశయించి యుండు సంభోగసుఖవిశేషము వలనను ఆకర్షణాది వ్యతిక్రమంబు వలనను సంశయంబు నొంది ఆకామినీమణి యగు తులసీదేవి,

సీ॥ పానుపుపైఁజేరి పవళించునంతలోఁ దమిఁగౌఁగిటకిఁ జేర్పఁ దత్తరిలుట
నాశతో వీడియం బందిచ్చునంతలోఁ బాలిండ్లుపట్ట సంభ్రమమువడుట
అగరుకుంకుమగంధ మలఁదెడునంతలోఁ గరము నీవికిఁ జేర్పఁ ద్వరపడుటయుఁ
గళమున సుమమాల్యగణ మిడునంతలో మోవినొక్కఁగ వైళమునఁ గడఁగుట
దయిత నసుఁగూడనింతతత్తఱపడంగ। నేల యొంటరినుండ నా బాల మారు
బారికోర్వఁగఁజాల నీపాదమాన। యనుచుఁ జైఁబడికూడుటల్ మానమునందు?

ఉ. జారుఁ డలభ్యయౌతరుణిసంగతి కువ్విళులూరుచుండి యా
చారుముఖీలలామ మొకచక్కి రహస్యమున న్లభింపఁగా
మారునిబారి కోర్వక క్రమం బెడబాసి మదిం గరంగుచుం
దారిచి దానితోడ సురతంబున సొక్కెడిరీతి దోఁచినన్.

సర్వమును మనమున విచారించుకొని శ్రీహరిం గనుంగొని నీ వెవ్వఁడవు? ఓమాయాపతీ నీవు నన్నుఁ గపటంబున ననుభవించితివి? నాసతీత్వము నీచేత దూరీకృతంబయ్యె. నిన్ను శపియించెదను. అని చెప్పినం దులసీవచనంబులు విని శ్రీహరి శాపభయంబువలన లీలమై మనోహరమైన యాత్మమూర్తిం దాల్చిన నాదేవి తనయెదుట సనాతనుండును, నవజలధరశ్యాముండును, శరత్పంకజలోచనుండును, కోటిమన్మథసుందరుండును, రత్నభూషణభూషితుండును, స్మితసుధామధుర ప్రసన్నాస్యుండును, పీతాంబరశోభితుండునునగు నాదేవదేవునిఁ గనుఁగొని యాకామిని కామమునఁ బొడము విలాసములును పులకలును గలిగి మోహమూర్ఛఁ జెంది మరల నొకింత సేపటికిఁ జైతన్యంబుఁ బడసి యాతులసీదేవి హరికిట్లనియె. ॥తులసి॥ ఓనాథా నీవు పాషాణసదృశుండవు. నీకు దయ లేదు. కపటంబున ధర్మభంగంబుఁ గావించి నీవు నాపతిం జంపితివి. ఓప్రభూ నీవు దయారహితుండవై పాషాణసదృశుండవై యుండుటం జేసి యీభవంబున నిప్పుడు నీవు పాషాణరూపుఁడవగుము. ఎవ్వరు నిన్ను దయాసింధువని చెప్పెదరో వారలు భ్రాంతులు. ఇందుకు సందియము లేదు. నాభర్త నీభక్తుఁడు. నిరపరాధి. అట్టుండ నాతనిని పరులకై యెట్లు చంపితివి. నీవు సర్వాత్ముఁడవు. సర్వజ్ఞుఁడవు. నీకుఁ బరులనుభవించు దుఃఖములును వ్యథలును తెలియక యున్నవి గాన నొకజన్మమునందు నీకివి తెలంపునకు వచ్చు. అని చెప్పి యాసాధ్వి హరిచరణములం బడి శోకార్త యగుచుఁ బలుమాఱు మిగుల రోదనంబుఁ గావించె. ఆతులసిదుఃఖంబుఁ గాంచి కరుణాసాగరుండైన కమలాపతి నయంబున నాయమను బోధింప నిట్లనియె. ॥శ్రీభగవంతుండు॥ ఓసాధ్వీ నీవు నన్ను భర్తఁ గాఁ బడయుటకు భారత

వర్షంబునందుఁ జిరకాలముతపంబాచరించితివి. నీతోసుఖంబనుభవింప శంఖచూడుఁడు బహుకాలము తపంబు సల్పినవాఁడు. ఆతపఃఫలంబు వలననాకాముకుఁడునిన్నుఁదనకుఁగామినింగాఁజేసికొని బహుకాలము విహరించెను. నీవొనరించినతపంబునకు ఫలంబిప్పుడ యొసంగందగిన దయ్యె. నీవీశరీరంబుంబరిత్యజించి దివ్యదేహంబుఁదాల్చి రాసంబునందు నాతోరమింపుము. లక్ష్మితోసమానురాల వగుము. ఈనీతనువు నదీరూపంబై గండకియనుపేరంబ్రసిద్ధివహించుచుఁ బరిపూతంబై నరులకుం బుణ్యప్రదంబై పావనంబై భారతంబునం బ్రవహించునది. నీకేశసమూహంబులు పుణ్యవృక్షంబులై వెలయుఁగాత. ఆవృక్షముతులసీకేశసంభూతంబులుగానఁ దులసియనుపేరంబరగుచుండు. ఓవరాననాఆతులసి త్రిలోకంబులందుఁ బుష్పంబులకుంబ్రధానమై దేవపూజనంబునకుముఖ్యంబై యొప్పునది యగుంగాత. ఓసుందరీ స్వర్గంబుననుమర్త్యంబుననుపాతాళంబునను వైకుంఠబునను నాసన్నిధియందునుపుష్పంబులలో నుత్తమంబులయినతులసీవృక్షంబులు మొలుచుంగాత. మఱియు గోలోకంబునను విరజాతీరంబునను, రాసంబునను, బృందావనభూమియందును, భాండీరమునందును, చంపకవనంబునను, రమ్యంబగుచందనకాననంబునను, మాధవీ కేతకీ కుంద మల్లికా మాలతీవనంబులను, తక్కుంగలపుణ్యస్థా

తులసీ మాహాత్మ్యము.

నములందునుపుణ్యప్రదంబులగునీతులసీతరువులు మొలుచుఁగాత. పుణ్యప్రదంబగుపుణ్యదేశమునఁ దులసీతరుమూలంబునందు సర్వతీర్థంబులు నధిష్ఠించియుండఁగలవు, ఓవరాననా తులసీపత్రతోయంబు తమపయిం బడుననితత్ప్రాప్తికై సర్వదేవతలును తన్మూలంబునం దధిష్ఠించియుండఁగలరు. తులసీపత్రతోయమున నెవ్వఁడభిషేకము సేయు; నాతఁడు సర్వతీర్థములందు స్నాతుండయినవాఁడు. సర్వయజ్ఞములందు దీక్షవహించినవాఁడు. శ్రీహరికి సుధాఘటసహస్రంబు సమర్పించిన నెంతతుష్టిగల్గు

నంతతుష్టి మనుష్యులు తులసీపత్రంబుసమర్పించినం గలుగును.నరుఁడు పదివేలగోవులనుదానముసేయుటచేత నెంతఫలముఁగాంచునో;యంత ఫలంబుఁ దులసీపత్రదానంబునం గాంచు. తులసీపత్రతోయము మరణ కాలంబున నెవ్వనికిలభించు; వాఁడు సర్వపాపవినిర్ముక్తుండయి విష్ణు లోకంబుంజెందు.ఏమానవుఁడు ప్రతిదినము భక్తితోఁ దులసీజలంబును ద్రావు;వాఁడు జీవన్ముక్తుండును గంగాస్నానఫలంబుగలవాఁడునగు. ఎవ్వండు నిత్యము నన్నుఁ దులసీపత్రంబులుసమర్పించి పూజించునో; వాఁడు లక్షాశ్వమేధంబులొనరించినఫలంబుం జెందు,నిందుసందియము లేదు.మానవుఁడు తులసినిఁ దనకరంబునంగాని దేహంబునంగానిధరించి తీర్థములందు ప్రాణంబులుపరిత్యజించెనేని విష్ణులోకంబునకుంజనును. ఏనరుఁడు తులసీకాష్ఠంబుననిర్మించినమాలికను ధరించునో; వాఁడు ప్రతి పదంబున నశ్వమేధంబొనరించినఫలంబుం జెందును.నిక్కము. తులసిని తనకరంబుననిడుకొని ప్రతిజ్ఞచేసి యెవ్వఁడుతనప్రతిజ్ఞంగాపాడఁడో; వాఁడు చంద్రసూర్యులుండుదనుకఁ గాలసూత్రంబుం జెందియుండు. ఏమానవుండు తులసితోమిథ్యాశపథంబుఁగావించు; నాతఁడుపదునల్వు రింద్రు లుండుదనుకఁ గుంభీపాకంబుం జెందియుండు.ఎవ్వఁడు మరణ కాలంబునఁ దులసీతోయకణంబుం జెందు; నాతఁడు రత్నమయవిమా నంబుననెక్కి శ్రీవైకుంఠంబునకుం బోవును.పూర్ణిమయందు, నమావా స్యయందును,ద్వాదశియందును, రవిసంక్రమణంబునందును, తైలాభ్యం గంబునను,స్నానంబునను,మధ్యాహ్నంబునను,రాత్రియందును,సంధ్యల యందును,ఆశౌచంబులందును, అశుచికాలంబులందును, రాత్రివస్త్రం బులుధరించుకొనియుండునప్పుడును తులసీదళంబుగిల్లినవారు శ్రీహరి శిరంబుగిల్లినవారలే. ఓసతీ పర్యుషితంబైనను తులసీపత్రము మూఁడు రాత్రులు శుద్ధంబై యుండు.ఓసతీ విష్ణునికినర్పితంబయినతులసీపత్రము భూమిపయింబడినను తోయంబునంబడినను క్షాళితంబుఁగావించినచో

శ్రాద్ధంబునను వ్రతంబునను దానంబునను ప్రతిష్ఠయందును సురార్చనంబునందును అన్యకర్మంబులందును శుద్ధంబై యుండు. ఆతులసీవృక్షమున కధిష్ఠానదేవతయగునది నిరామయమగుగోలోకమునందుం గృష్ణునితో రహస్యమునందు నిరతము క్రీడసల్పంగలదు. నదికధిష్ఠానదేవతయగునది భారతమునం బుణ్యప్రదుండై మదంశసంభూతుండగులవణసముద్రునికిం బత్నిగాంగలదు. మహాపతివ్రతవైననీవు స్వయము వైకుంఠమునందు నాసన్నిధియందు రాసమున రమాదేవితోసమానురాలవై యుండం గలవు. ఇందుకుసందియము లేదు. నేనునునీశాపముచేత భారతమునందు గండకీనదీతీరమునకు సమీపమున శైలరూపినై యుండంగలను. అందు వజ్రదంష్ట్రిలు గలవజ్రకీటము లనుక్రిములు ఆశిలాకుహరములందు మదీయము లగుచక్రములనుగల్పించును.

## సాలగ్రామశిలాలక్షణము.

ఒక్కద్వారమున నాల్గుచక్రములు గలిగి వనమాలాభూషితంబై నవీననీరదముంబలె శ్యామవర్ణంబై యుండునది లక్ష్మీనారాయణనామము గలది. ఒకద్వారమున నాలుగుచక్రములుగలిగి నవీననీరదోపమంబై వనమాలావిరహితంబయి యుండునది లక్ష్మీజనార్దననామముగలది. ద్వారద్వయమున నాలుగుచక్రములుగలిగి గోష్పదముతోంగూడుకొని వనమాలారహితంబైయుండునది రఘునాథనామకం బనియెఱుంగునది. మిగులచిన్నదియు రెండుచక్రములుగలదియునై నవీనజలదప్రభలుగలిగి యుండునది దధివామననామకము. అది గృహస్థులకు సుఖప్రదము. మిగులచిన్నదియై రెండుచక్రములుగలిగి వనమాలావిభూషితంబైయుండునది దేవుం డయినశ్రీధరుం డని యెఱుంగనగు. అదిగృహస్థులకు సదా శ్రీప్రదము. స్థూలమును వర్తులాకారమునునై వనమాలారహితమగుచు రెండుచక్రములుగలిగి యత్యంతముస్ఫుటంబై యుండునది దామోదరనామముగలది. సూక్ష్మమును స్థూలమునుగాక మధ్యమంబై వర్తులా

కారమగుచు రెండు చక్రములుగలిగి బాణవిక్షతమైశరతూణయుక్తమై యొప్పుచుండునది రణరామనామక మనియెఱుంగనగు. మధ్యమంబై యేడుచక్రములుగలిగిఛత్రతూణసమన్వితమగుచునుండునది రాజరాజేశ్వరం బనునామముగలది యనియెఱుంగనగు.అది నరులకు రాజసంపత్ప్రదం బగును.పదునాలుగుచక్రములుగలిగి స్థూలంబై నవీనజలదప్రభంబగుచుండునది యనంతంబనునాఖ్యగలది యనియెంచనగు.అది చతుర్వర్గ ఫలములనొసంగు. చక్రాకారంబై రెండుచక్రములుగలిగి శ్రీయుక్తంబై జలదప్రభంబగుచు గోష్పదముతోఁగూడినదై మధ్యమంబగు చుండునది మధుసూదనం బనియెఱుంగుజను. ఒకచక్రముగలది సుదర్శనము. గుప్తచక్రమగునది గదాధరము. రెండుచక్రములుగలిగి యశ్వశిరోకారమయి యుండునది హయగ్రీవం బనినుడువంబడు.ఓసతీ మిగులవిస్తృతం బగుమొగంబుగలిగి రెండుచక్రములతో వికటంబై యుండునది నరసింహనామకము. అది నరులకు సద్యఃకాలమున వైరాగ్యంబొసంగు.రెండుచక్రములుగలిగివిస్మృతంబగుమొగముతో వనమాలాసమన్వితమగుచువెలుంగునది లక్ష్మీనృసింహమని పేరుగలది. అదిసదా గృహస్థులకు సుఖప్రదము.ద్వార దేశమున రెండుచక్రములుగలిగి శ్రీయుక్తంబయి సమంబయి స్ఫుటమగుచునుండునది వాసుదేవనామకము. అది సమస్తకామఫలములనొసంగునది. సూక్ష్మచక్రసమన్వితంబై నవీన నీరదప్రభలుగలిగి సుషిరమునఛిద్రబహుళంబై యుండునది ప్రద్యుమ్ననామకము.అది గృహస్థులకుసుఖప్రదము. ఎందుఁ బృష్ఠమున రెండు చక్రము లేకముగఁ జేరికొనియుండు;నది సంకర్షణాభిధంబనియెఱుంగనగు. అది గృహస్థులకు సదా సుఖప్రదము. పీతంబయినవర్ణంబుగలిగి వర్తులంబై యతిశోభనంబై యుండునదియనిరుద్ధం బనునామముగలది. అది గృహస్థులకు సుఖప్రదం బని మనీషులు చెప్పుదురు.

## సాలగ్రామమాహాత్మ్యము.

ఎచ్చోటసాలగ్రామశిలయుండు నచ్చోట హరి సన్నిహితుండై యుండు. అచ్చోట లక్ష్మియు సర్వతీర్థసమన్వితయై వసియించును. బ్రహ్మహత్యాదికము లగుపాపములెవికలవో యవి యన్నియు సాలగ్రామశిలార్చనముచేత నశించు. ఛత్రాకారంబగునేని రాజ్యంబుగల్గు. వర్తులంబైన మహాశ్రీ చేకూరు. శకటాకారంబైన దుఃఖంబుగలిగించు. శూలాగ్రంబగునేని నిక్కముగ మరణము సంభవించు. వికృతాస్యంబగునేని దారిద్ర్యంబిచ్చు. పింగళంబయ్యేనేని హానింజేయు. నగ్నచక్రంబయిన వ్యాధిఁ బుట్టించు. విదీర్ణంబయియుండిన ధ్రువంబుగ మరణంబుఁగల్పించు. సాలగ్రామశిలయుండెనేని వ్రతంబును, దానంబును, ప్రతిష్ఠయు, శ్రాద్ధంబును, దేవపూజనంబును, ప్రశస్తంబగును. ఎవ్వఁడు సాలగ్రామశిలాతీర్థంబున నభిషేకంబుఁగావించు; వాఁడు సర్వతీర్థంబుల స్నానంబుసల్పినవాఁడు. సర్వయజ్ఞంబులందు దీక్షవహించినవాఁడు. సర్వదానంబులాచరించుటవలనను, భూమికిఁబ్రదక్షిణంబాచరించుటవలనను, సర్వయజ్ఞంబులాచరించుటవలనను, సర్వతీర్థములందుఁగ్రుంకుటవలనను, అనశనాదివ్రతంబులుజరుపుటవలన నేపుణ్యంబుగలుగు; నాపుణ్యంబుసాలగ్రామశిలార్చనంబుననగు. నిఖిలతీర్థంబులు నాతనిస్పర్శమువడయఁగోరుచుండు. ఆతండు జీవన్ముక్తుండై మహాపూతుండై యుండు. ఇందుకుసందియంబు లేదు. చతుర్వేదపారాయణంబును తపస్యాకరణంబును జేసినచో నగు పుణ్యంబు సాలగ్రామశిలార్చనంబున నగును. ఏనరుఁడు నిత్యము సాలగ్రామశిలాతోయంబుఁ బానముచేయు; వాఁడు సురలవలన నభీష్టంబులును జన్మమృత్యుజరాహారంబైన ప్రసాదంబునుబడసి జీవన్ముక్తుండై మహాపావనుండగుచు నంతంబునహరిపదంబుం జెందు. నిఖిలతీర్థంబులును తదీయస్పర్శంబుఁ గోరుచుండును. ఆతఁడు ఆహరిపదంబునందు శ్రీహరి తోఁగూడి యసంఖ్యంబులయినప్రాకృతలయంబులను గనుచు దాస్య

కర్మంబున నియుక్తుండై యుండును. బ్రహ్మహత్యాదిపాపంబులెల్ల వానిం గాంచి వైనతేయునిం గాంచినయురగంబులపగిది భయంబునం బరువిడును. ఆతనిపాదపద్మధూళి సోకెనేని వసుంధర తత్క్షణంబునఁ బావనత వహించు. ఆతండు జన్మించుటం జేసి తత్పితృలను లక్షసంఖ్యలను నిస్తరింపంజేయు. ఎవ్వనికి మృత్యుకాలంబున సాలగ్రామశిలాతోయంబు లభించు; వాఁడు సర్వపాపవినిర్ముక్తుండై విష్ణులోకంబునకుం జను. నిర్వాణముక్తిం జెందును. కర్మభోగంబువలనవిముక్తుండగును. విష్ణుపాదంబులం బ్రలీనుండగును. నిక్కము. ఎవ్వఁడు సాలగ్రామశిలం బట్టుకొని మిథ్యావాదంబుఁ జేయు; వాఁడు బ్రహ్మయువుదనుక కర్మదంష్ట్రింబును జెంది యుండు. సాలగ్రామశిలనుదాకి ప్రతిజ్ఞ చేసి యెవ్వఁ డాప్రతిజ్ఞాపాలనంబు సేయఁ డామనుజుఁడు లక్షమన్వంతరంబులకంటె నధికకాల మసిపత్రవనంబుననుండు. ఓకాంతా ఎవ్వండు సాలగ్రామంబునకుఁ దులసీపత్రవిరహంబుఁ గావించు; వానికి జన్మాంతరంబునందు స్త్రీవిచ్ఛేదంబు సంభవించు. ఎవ్వఁడు శంఖంబునకుఁ దులసీపత్రవిరహంబుఁ జేయు; వాఁడు భార్యాహీనుఁడై యేడుజన్మంబులు రోగంబనుభవించును. సాలగ్రామంబును, తులసిని, శంఖంబు నొక్కచోటనునిచి యెవ్వఁడు రక్షించు; మహాజ్ఞానియగు నాతనియందు శ్రీహరికిం బ్రీతిగల్గు. ఎవ్వఁ డొకపత్నియైన దేనియందు వీర్యాధానంబొనరించునో? ఆతనికా కామినితో విరహంబు గల్గెనేని పరస్పరము దుఃఖము గల్గుఁగదా? నీ వొకమన్వంతరముదనుక శంఖ చూడునికిఁ బ్రియురాలవై యుంటివి. కాన శంఖంబుతో విరహంబు నీకు కేవలము దుఃఖప్రదము. అని యిట్లు శ్రీహరి యాతులసికి సాదరంబుగఁ జెప్పి యూరకుండెను. అనంతర మాతులసియు దేహంబుం బరిత్యజించి దివ్య

దివ్యరూపముఁ దాల్చినతులసిని నారాయణుఁడు పరిగ్రహించుట.

రూపంబు ధరించెను. ఇట్లు దివ్యరూపధారిణియై యాతులసి శ్రీదేవిచందంబున శ్రీహరివక్షంబునందు వసియించె. కమలాపతియు నాకాంతం

దోడ్కొని వైకుంఠంబునకుంజనియె. ఓనారదా యదిదొట్టియాశ్వరుండైన శ్రీహరికి లక్ష్మియు, సరస్వతియు, గంగయు, తులసియు ననినల్వురుభార్య లైరి. తులసి ప్రాణంబులుపరిత్యజింపఁగాఁ దక్షణంబునన యామెదేహంబువలన గండకీనది యుద్భవించె. నారాయణాంశంబున నాగండకీనదీతీరంబునందు నరులకుఁబుణ్యప్రదం బయినశైలంబును సంభవించెను. ఓమునీ నారదా యాపర్వతంబునందుఁగలక్రిములు దానిశిలలను బహువిధములుగాఁ దొలుచు. ఆక్రిములుతొలిచినశిల లానదీజలంబులంబడినయవి జలదంబులబోలి నల్లనివై యుండు. స్థలంబునఁబడినవి రవితాపంబుచేతఁ బింగళవర్ణంబులై యుండు. ఓనారదా నీవడిగినదంతయుఁ జెప్పితి నింకనేమివినంగోరెదవు.

ఇది శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునఁ బ్రకృతిఖండమునందు నారాయణనారద సంవాదమునందుఁ దులస్యుపాఖ్యానంబున నేకవింశాధ్యాయము ముగిసెను.

## తులసీమంత్రస్తోత్రవివరణము.

నారదుండిట్లనియె. తులసిజగత్పూజ్యురాలు. మిగులపావనమైనది. నారాయణునికింబ్రియురాలు. అట్టితులసీపూజావిధంబును స్తోత్రంబు నేదియో నేనువినలేదు. ఓమునీ ఆతులసిని ప్రథమంబున నెవ్వఁడు పూజించెను. ఎవ్వఁడుస్తుతించెను. ఈసంసారమునందుఁ బూజ్యురాలై యుండుట కేమికారణము. ఇదంతయు నాకుందెల్పుము. ॥సూతుండిట్లనియె॥ అని నారదుండడిగిన నాతనివచనంబులువిని మునిపుంగవుండగు నారాయణమహర్షి నవ్వి పురాతనంబును పుణ్యరూపంబునైయుండు కథను నారదునికిం జెప్పుటకుపక్రమించెను. ॥నారాయణమహర్షి॥ ఓనారదా యిట్లునారాయణుండు తులసీదేవింబడసి రమాంశసంభూతురాలైనయారామామణితో రమించెను. ఆ సౌభాగ్యవంతురాలగుతులసిని గౌరవంబున రమాసమానురాలను గావించెను. లక్ష్మియు, గంగయు, నా

తులసీదేవితో నవసంగమసుఖంబుఁ దమనాథుండనుభవించుటకు దాని సౌభాగ్యంబుకొఱ కామె కేర్పఱచినగౌరవంబునకును ఈసడించుకొనక సహించుకొనిరి. సరస్వతిమాత్రము కోపంబుచేత సహింపఁజాలకయుండెను. ఆవాణి తననాథుండు తులసితో నవసంగమసుఖంబు ననుభవించుచున్నాఁడని యెఱింగి క్రోధమూర్ఛితయయి యయ్యెడకుంజని క్రీడాపరిశ్రాంతయైసుఖసుప్తింజెందియుండుతులసిం గాంచి శ్రీహరిసన్నిధానంబున నాతులసితోఁ గలహించి యామెను ప్రహరించెను. ఆతులసీదేవి అందుకుసిగ్గుపడి జ్ఞానవంతురాలును సిద్ధయోగినియు సర్వసిద్ధేశ్వరియు నగుటంజేసియంతర్ధానంబునొందెను. ఆవిచిత్రమేమందును. ఆహరికిసయితమాయమ కోపంబువలన నెచ్చోట వెదకినను గనంబడకయుండె. హరి సర్వస్థలంబులను తులసినన్వేషించికనుంగొనక సరస్వతికింగోపంబు శాంతపఱిచి యామెను వేడుకొని యావాణియనుజ్ఞవడసి తులసీవనంబునకుంజనియె. అయ్యెడకుంజని స్నానంబుచేసి తులసీసతిని తులసీదళంబులం బూజించి యామెనుధ్యానించి భక్తితో స్తోత్రముచేసెను. * లక్ష్మీ, మాయా, కామ, వాణీబీజాక్షరంబులు పూర్వమునం జేరిచి స్వాహాశబ్దంబునంతంబునసమ్మిళితముగావించియుండునదియై చతుర్థ్యంతంబయి యొప్పు బృందావనియనునది దశాక్షరంబులు గలయట్టితులసీమంత్రము. ఓ నారదా కల్పతరువనందగునీమంత్రరాజంబుచేతశాస్త్రోక్తవిధానంబునఁ బూజించినచో నరుండు సర్వసిద్ధులువడయును. ఓ నారదా ఘృతదీపమును ధూపమును సిందూరంబును చందనంబును నైవేద్యంబును పుష్పంబులు నుపహారంబులును సమర్పింపఁజనును. శ్రీహరిరచియించినస్తోత్రంబుచేఁ బరితోషంబునొంది యాతులసీదేవి తులసీవృక్షంబువలననుండి యావిర్భవించి శుభంబయినయాహరిచరణంబులంబొంది శరణంబువేఁడెను. అప్పుడాతులసీదేవికి విష్ణువు జగత్పూజ్యయగుదువుగాతయనివరం

---

* లక్ష్మీ,మాయా, కామ,వాణీబీజపూర్వం దశాక్షరం। బృందావనీతిఙేంతం చవహ్నిజాయాంతమేవచ ॥

బొసంగె. మఱియు నాప్రభువు ఓ తులసీ నేను నిన్ను మూర్ధంబునను వక్షంబునను ధరించెదను. సురాదులెల్లవారును నిన్ను తామెమూర్ధంబులధరియించెదరు.అనియుంజెప్పియామోదోద్రేకుండై హరియుఁ దనమందిరంబునకుంజనియె.అని చెప్పిన నారదుండు నోమహాప్రభావసంపన్నుండవగునారాయణమహర్షి తులసికి ధ్యానంబెద్ది?స్తోత్రంబెయ్యది?పూజావిధిక్రమంబెట్టిది?ఇదియంతయు నాకు వ్యాఖ్యానముసేయు మనియడిగిన నారాయణమహర్షి యిట్లనియె.ఓనారదా యాతులసీదేవి యంతర్ధానంబొందినయనంతరము శ్రీహరి తులసీవనంబునకుంజని పూజించి విరహాతురుండై యిట్లు స్తుతియించెను.

ఒకచోట బృందరూపముగ వృక్షములు సంభవించుటంజేసి యేదేవిని బుధులు బృందయనినుడువుదురట్టినా ప్రియురాలిని నేను భజియించెదను ॥ ౧ ॥ ఏదేవి తొల్లి ప్రథమంబున బృందావనమనువనంబున నుద్భవించుటంజేసి బృందావనియనునామంబునవిఖ్యాతింజెందెనో యాసౌభాగ్యవతిని నేను భజియించెదను॥ ౨॥ఏదేవి యసంఖ్యాతంబులయిన విశ్వంబులందు నిరంతరము పూజింపఁ బడుటవలన విశ్వపూజితయను నాఖ్యంజెందెనో? యాజగత్పూజ్యయగు దేవినిభజించెదను॥ 3 ॥ ఏదేవి తనవలన నసంఖ్యాతంబులైనవిశ్వములు పావనంబులగుటంజేసి విశ్వపావనియనునామంబు వడసెనో యాదేవిని విరహంబుచే నేనుస్మరించెదను॥౪॥ఏదేవి తాను లేక దేవతలు పుష్పములపుంజంబులఁదుష్టిం జెందమిచేతఁ బుష్పసారయనునామంబుగాంచె; నాపరిశుద్ధయగు దేవినిశోకము

‡ తులసీ స్తవమూలము.శ్లో॥బృందారూపాశ్చవృక్షాశ్చయదేకత్రభవంతిచ।విదుర్బుధాస్తేనబృందాంమత్ప్రియాంతాం భజామ్యహం ॥ ౧ ॥ పురాబభూవసాదేవీ హ్యాదౌబృందావనేవనే.। తేనబృందావనీఖ్యాతా తాంసౌభాగ్యాంభజామ్యహం ॥ ౨ ॥ అసంఖ్యేషుచవిశ్వేషు పూజితాయానిరంతరం । తేనవిశ్వపూజితాఖ్యాం జగత్పూజ్యాంభజామ్యహం॥ 3॥ అసంఖ్యానిచవిశ్వాని పవిత్రాణియయాసదా । తాంవిశ్వపావనీం దేవీం విరహేణ స్మరామ్యహం ॥౪॥ దేవానతుష్టాపుష్పాణాం సమూహేనయయావినా । తాంపుష్పసారాంశుద్ధాంచ

వలనఁగనుంగొన నెంచెదను॥౫॥విశ్వమునం దేదేవి తాలభించినమాత్రాన
నిక్కముగ భక్త్యానందంబు సంభవిల్లుటంజేసి నందినియను నామంబు
వడసె; నాదేవి నాయందు సుప్రీతయగుఁగాత ॥ ౬ ॥ ఏదేవితనకునిఖి
లంబులైనవిశ్వంబులందును దులనలేనందున దులసియనునామంబుఁజెం
దెనో; యట్టినాప్రియురాలిని శరణుఁజొచ్చెదను॥ ౭ ॥ ఏదేవి శ్రీకృష్ణజీ
వనరూపయయి నిరతమాతనికిం బ్రియతనువై యుండుటవలనఁగృష్ణ
జీవనియనునామంబుఁ గాంచెనోయాదేవినాజీవనంబురక్షించుఁగాత ॥
౮॥అని యివ్విధంబున స్తోత్రంబుసల్పి రమావల్లభుం డయ్యెడనుండఁగాఁ
దులసియుఁ దాను సాక్షాత్స్వరూపంబుఁదాల్చికొని వచ్చి యాహరి
చరణకమలంబులందువినతయైన నాసతీతిలకంబుఁగాంచి మానపూజిత
యైయుండునామానిని యభిమానంబున రోదనంబుసేయఁగాఁ బ్రియం
బెసఁగగారవించి యాప్రియురాలిని శీఘ్రమునేదనవక్షస్థలంబుననుంచు
కొని భారతీదేవినడిగియామెయానతివడసి శ్రీహరిమందిరంబునకుంగొని
పోయెను. భగవంతుండును నైశంబ తులసీదేవికి భారతీదేవితో సఖ్యంబు
గావించెను.ఆతులసికి హరి విశ్వపూజ్యురాలవగుము;అందఱకునుశిరం
బులందాల్పందగినదానవగుము;సర్వజనంబులకువందనీయురాలవగుము;
నాకుమిగులమాన్యురాలవగుమనియువరంబొసంగెను.ఆదేవియు విష్ణుని
వరంబుచేతఁ బరితుష్టురాలయ్యె.సరస్వతియును తులసి నాలింగనంబుచే
సికొని తనసన్నిధియందుఁ గూరుచుండంబెట్టుకొనియె.ఓనారదా లక్ష్మి

---

ద్రష్టుమిచ్ఛామిశోకతః ॥౫॥ విశ్వేయత్ప్రాప్తిమాత్రేణ భక్త్యానందోభవేద్ధ్రువం । నందినీ
తేనవిఖ్యాతా సాప్రీతాభవతాద్ధిమే ॥౬॥ యస్యాదేవ్యాస్సమంనాస్తి విశ్వేషునిఖిలేషుచ ।
తులసీతేనవిఖ్యాతా తాంయామిశరణంప్రియాం ॥౭॥ కృష్ణజీవనరూపాయా శశ్వత్ప్రియతత
మాసతీ । తేనకృష్ణజీవనీతి సామేరక్షతుజీవితం ॥ ౮ ॥

యు గంగయును జిఱునగవుతోఁగనుంగొనుచు నాతులసినెదుర్కొని యాలింగనంబుఁగావించుకొని తోడితెచ్చి గృహంబునంబ్రవేశపెట్టిరి.

## తులసీస్తోత్రపూజాఫలము.

¶ బృంద,బృందావని,విశ్వపావని,విశ్వపూజిత,పుష్పసార,నందిని,తులసి, కృష్ణజీవని.యను నెనిమిదినామంబులుగలిగి నామార్థంబులతోనొప్పుచుం డునీస్తోత్రంబును ఎవ్వఁడు తులసినిపూజించిపఠియించు;నాతఁడశ్వమేధ ఫలంబుంబొందును.కార్తికమాసంబునం బున్నమనాఁడు తులసీదేవికి జన్మమంగళము. అందాతులసీపూజ తొలుత శ్రీహరిచేఁజేయంబడియె. విశ్వపావనియగునాతులసినినందుభక్తితోఁబూజచేసినవాఁడు సర్వపాప వినిర్ముక్తుండై విష్ణులోకంబునకుంజనును. కార్తికమాసంబునం దులసీ పత్రంబు విష్ణునికర్పించినవాఁ డయుతసంఖ్యాకంబులగుగోవులను దాన ముచేసినఫలమునుబడయును.నిక్కము.ఈతులసీస్తోత్రంబు స్మరించినంత మాత్రంబున నపుత్రుండు పుత్రులంబడయు. పత్నీవిరహితునికిఁబత్ని లభించు. బంధువులులేనివాఁడుబంధువులంబడయు. రోగియగువాఁడు రోగంబువలనవినిర్ముక్తుండగును. బద్ధుండుబంధనంబువలనవినిర్ముక్తినొం దును. భయంబునొందినవానికిభయంబుడుగును. పాతకియగువాఁడు పాపంబులువాయును.ఓనారద!తులసీస్తోత్రంబిదినీకువచించితిని.ధ్యానం బునుపూజావిధానంబును వినుము. కాణ్వశాఖోక్తంబగుధ్యానంబును నీకునేఁజెప్పెద;నదియెఱింగి పూజింపఁజనును.ఆతులసి నావాహనంబు లేకపూజింపనగును. ధ్యానముచేసి షోడశోపచారంబులంబూజించుట పాతకనాశనము.

---

¶ తులసీనామాష్టకము. శ్లో॥ బృందాంబృందావనీంవిశ్వపావనీంవిశ్వపూజితాం।పుష్ప సారాంనందినీంచ తులసీంకృష్ణజీవనీం ॥ ఏతన్నామాష్టకంచైవ ”

* తులసీధ్యానము. పుష్పంబులలోపలసారయయి; సతియయి; పూజ్యురాలై; మనోహారిణియై; సకలపాపములనెడియిధ్మములనుదహియించుటకుజ్వలించుచుండునగ్నిజ్వాలలకుసమానురాలై; పుష్పంబులందును దేవస్త్రీలయందును దనకుఁదులనలేమింజేసి తులసియనుపేరువడసియన్నింటికింబవిత్రరూపిణియై; యందఱకునుశిరంబులధారణముచేసికొనందగినదియై; ఈప్సితంబులొసంగి; విశ్వపావనియై; జీవన్ముక్తురాలై; ముక్తిప్రదయై; హరిభక్తిగలుగంజేయునదియై; యుండుతులసీదేవినిభజించెదను. అనియివ్విధముననధ్యానించి పూజించి స్తుతించి బుధుండగువాఁడు ప్రణామంబులాచరింపంజనును. ఓనారదా తులస్యుపాఖ్యానము వచించితిని. మఱియునేమియడిగెదవు.

---

తులసీధ్యానమూలము.* శ్లో ॥ తులసీంపుష్పసారాంచసతీంపూజ్యాంమనోహరాం। కృత్స్నపాపేధ్మదాహాయ జ్వలదగ్నిశిఖోపమాం. ॥ పుష్పేషుతులనాప్యస్యా నాసీద్దేవీషు వామునే । పవిత్రరూపాసర్వాసు తులసీ సాచకీర్తితా ॥ ౨ ॥ శిరోధార్యాంచసర్వేషామీప్సితాంవిశ్వపావనీం। జీవన్ముక్తాంముక్తిదాంచ భజేతాంహరిభక్తిదాం ॥ 3 ॥

ఇది శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునఁ బ్రకృతిఖండమునందు నారాయణనారద
సంవాదమునందుఁ దులస్యుపాఖ్యానం బనుద్వావింశాధ్యాయము
ముగిసెను.

శ్రీ తులస్యుపాఖ్యానము
సంపూర్ణము.

# ప్రకటన.

ఈతులస్యుపా...ఖ్యానము" లక్ష్మీదేవి తాను తులసి యనుమతియొకయవతార వైకుంఠాధిపతికి స...భార్యగా వెలసి; స్వసంజనితం బగుతులసి యనుపత్రరాజ భగవంతునికి సర్వపుష్పములకంటెం ప్రీతిపాత్రం బై సర్వదా యాతనికి భార్యమై... నట్లు తులసీదేవీరూపధారిణి యైయుండుతాను తత్తులసీవ...క్షాధిష్ఠానదేవతాత్వమంగీ... సమస్తలోకపూజ్యత వడయుచుండుచరిత్రము.

అనఁగా! వైకుంఠాధిపతి తనదివ్యపట్టమహిషీజనంబు...తో కేళీవిలాసంబు లన... పఁదలంచి క్రేగంటంగనుంగొనఁ నప్పుడు మందస్మితసుందరవదనారవిందయైనగంగతోం గలపింంచినసరస్వతిశాపంబునం జేసి లక్ష్మి ధర్మధ్వజునికిం...యై; గోలోకనివాసిని యగు తులసియనుగోపికయం దావహించిజనించి; శంఖచూడునికిం...నియై; శంకచూడుని సంహరించునప్పుడు నారాయణునిచేఁ బాతివ్రత్యభంగంబువడసి; భగవదనుగ్రహమువం జేసి దివ్యత్వంబుఁ జెందె.—

ఈయుపాఖ్యానము, ...మరమణీయమగుకథ. శృంగారవీరకరుణాదిరసములునిండి యుండును. బహువిచిత్రముగాను, వినవినమనస్సున కత్యాహ్లాదకరముగాను, శృంగార నాయకీనాయకచరిత్రరూపముగాను, అపూర్వముగాను, అత్యద్భుతముగా నుండునుగనుక సకలజనులు పఠించి యానందింపందగినదైయున్నది.

☞ తులస్యష్టకంబును, తులసీస్తోత్రంబును, తులసీపూజయు, తులసీమంత్రంబును వా... యర్థములును ఇందుఁ జెల్ప...డియుండు.

ఇట్టిచరితామృతమును సకలజనులు నాస్వాదింతురని నేను పురాణశిరోమణి యైన బ్రహ్మవైవర్తమహాపురాణమునందలి ప్రకృతిఖండమునుండి యెత్తి సంస్కృతమునకుసరిగా సులభవచనశైలితో నాంధ్రీకరించితిని. పద్యములు నడుమనుండినను వానికి వచనమును కూడ నేయుండును. ఇదిముద్రితమై విక్రయింపఁబడుచున్నది. వెల రు. 0—6—0. అం...  0—1—0. వలయువారు నాపేర వ్రాసి, తెప్పించుకొనవచ్చును. వి. పి. మూలముగాను పంపఁబడును. పోష్టేజీవగైరాఖర్చులు కొనువార లచ్చుకొనవలయును.

ఇది సికింద్రాబాదులో రేవూరు రాజయ్యసత్రములో శ్రీమాన్, బుర్రా - శేషాచార్యులవారియొద్దను దొరకును.

ఇట్లు,
గ్రంథకర్త,
చిలకపాటి - వేంకటరామానుజశర్మ,
నెం. 34, వెంకట్రామయ్యవీధి,
మద్రాస్.